EACH POWER CAN BE UNLOCKED BY EATING THEIR FAVOURITE POPPINS. 10 POWERS: ***SHAPE SHIFTER***- GREEN APPLE, ***SPEED***-MANGO, ***FLIGHT***-ORANGE, ***GIANT***-WATERMELON, ***STRENGTH***-RASPBERRY, ***SHRINK***-LYCHEE, ***INVISIBLE***-PINEAPPLE, ***STRETCH***-MUSK MELON, ***FISSION***-BLACK CURRANT, ***FORCE FIELD***-GUAVA.

***RECAP:*** RAM AND SHYAM RESCUE AN ALIEN - ZARTOGAARR, WHAN HIS SPACESHIP CRASHES TO EARTH. IN RETURN HE GIFTS THEM THE DEKATRIX, ***A POWERFUL GADGET*** WITH ***10 POWERS.***

PARLE®

POPPINS®
Doon Kya?

# Ram and Shyam

## జోంబాట్స్

### పార్ట్ 2

**ఈ అద్భుతమైన శక్తిని అన్‌లాక్ చేసే రహస్యం తెలుసుకొనుటకు**
**http://www.parleproducts.com/brands/parlepoppins**
**మరియు www.chadamama.com//parle/index.php?pHcld=11**

జరిగిన కథ : జపాన్ జోంబాట్స్ అనబడే ఒక అనుమానస్పద జీవులచే దాడి చేయబడింది. వారిని అదుపు చేయడానికి రామ్ మరియు శ్యామ్ జోంబాట్స్ అదుపు చేసే మాస్టర్ బ్రెయిన్‌లోకి ప్రవేశిస్తారు.

జోంబాట్స్ యొక్క మాస్టర్‌కు ఇప్పుడు తన జ్ఞాపకశక్తిపై అదుపు ఉంచుకోవడం కష్టమయింది.



రామ్ మరియు శ్యామ్ ఈ మాస్టర్ సైంటిస్ట్ చియో టొయమ కుమారుడిగా గుర్తిస్తారు.







టొయమ సూచనల మేరకు జోంబాట్స్ సిటీని నాశనం చేయడం ప్రారంభించారు.



టొయామా మెదడు నుండి మొత్తం వివరాలన్నింటినీ తీసేసిన తర్వాత రామ్ మరియు శ్యామ్ అతని మెమోరీని ఎప్పటికీ చెరిపేసారు.




అయుము యొక్క తంత్రాలు మరియు మంత్రాలు లేకపోవడంతో, జోంబాట్స్ బలహీనపడతాయి.




రామ్ మరియు శ్యామ్ బ్లాక్ కరంట్ రుచిగల పాపిన్స్‌ని పాప్ చేసి తమని తాము వేల మందిగా మార్చుకున్నారు.



జపానుకు మిగతా ప్రపంచానికి జోంబాట్స్‌ని నాశనం చేసాక ప్రమాదం నివారించబడింది. టొయమని సైక్రియాట్రిక్ హాస్పిటల్‌కి పంపారు.



# యువ విజేతలు

మీ కుటుంబంలో గాని, పొరుగున ఉన్న కుటుంబాలలో గాని ఎవరినయినా ఉదయతారగా ప్రతిపాదించాలని మీరు భావిస్తున్నారా? దయచేసి బాలబాలికల వివరాలు మరియు మీ ప్రతిపాదనలను మాకు పంపించండి:

Young Achievers-RCM,
Chandamama India Ltd,
No:2 Swati Enclave,
Door No 5 & 6,
Amman koil street,
vadapalani, chennai-26
(or)
online@chandamama.com



## సడలని గురి

సృష్టి విశ్వకర్మ 12 ఏళ్ల వయస్సు కల చిన్నారి. చిరు ప్రాయంలోనే ఈమె అద్భుత విజయం సాధించింది. ఇటీవలే రాంచీలో నిర్వహించిన 34వ జాతీయ క్రీడలలో విలు విద్యలో ఈమె ప్రకంపనలు సృష్టించింది.

ఈమె తండ్రి రాంచీలో చిన్న మరమ్మతు అంగడిని నిర్వహిస్తున్నారు. అయితే ఈయన ఆటల విషయంలో సృష్టికి, ఆమె చిన్న చెల్లెలుకి అన్ని సౌకర్యాలు కల్పించి ప్రోత్సహించారు. ఈ మధ్యనే పుణేలో నిర్వహించిన 56వ జాతీయ పాఠశాల క్రీడలలో ఈమె కంచుపతకం సాధించి అండర్ 14 పోటీలో తన జట్టును తొలి స్థానంలో నిలిపింది. 2010లో విజయవాడలో జరిగిన మినీ నేషనల్ ఆర్చరీ పోటీలో సృష్టి స్వర్ణపతకం సాధించింది.

లోహర్‌దాగా రాంచీలోని త్రివేణి పబ్లిక్ స్కూల్‌లో సృష్టి 7వ తరగతి చదువుతోంది. తను సాధించిన విజయాలు చూసి ఆమె పాఠశాల మొత్తంగా గర్విస్తోంది.

జార్ఖండ్‌నుంచి వస్తున్న ఇతర క్రీడాకారులకు సృష్టి గొప్ప ప్రేరణను అందిస్తోంది. ఆ రాష్ట్రంలో మౌలిక వసతులు మెరుగుపడుతుండటంతో సృష్టి, ఆమెలాంటి అనేకమంది క్రీడాకారిణులు జాతీయ స్థాయిలో చక్కటి ప్రతిభ కనబర్చగలరని ఆశిస్తున్నారు. అంతర్జాతీయ స్థాయిలో కూడా భారత్‌కు స్వర్ణపతకాలు గెల్చుకురావాలని వీరు కలలు కంటున్నారు. ఈ విలువిద్యా విజయబాలకి చందమామ శుభాభివందనలు.











అక్టోబర్ 2011 ` 20/-

*Founded by* **B. Nagi Reddi and Chakrapani**

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar

**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju

**Sub Editor :**
Patricia Pandian

**Content Head - Online :**
Sowmya Bharadwaj

**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar

**Artist :**
Venki

**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar

**Production In-charge :**
Prashant Pawar

**Circulation:**
circulation@chandamama.com

**Asst. Manager - Sales & Circulation:**
Subhankar Rej

**Sales Officer - Circulation :**
K. Ravishankar

**Advertisement :**
sales@chandamama.com

**Subscription :**
Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828

**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
P.O.Box No:19407, Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD.,
Published and Printed on their behalf by Prashant Sharad Muleker
Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093.
Printed At :- Kala Jyothi Process Pvt. Ltd, S.No.185, Kondapur, R.R.District-500133, Andhra Pradesh.
Editor :- Prashant Sharad Mulekar

T


# ఈ సంచికలో ...

## చందమామ

Volume-2 October 2011 Issue-10



© The stories, articles and designs contained in this issue are the exclusive property of the Publishers. Copying or adapting them in any manner/ medium will be dealt with according to law.

# చరిత్రకు సాక్షీభూతం... గాంధీ -II

అక్టోబర్ నెల సంపాదకీయం రాసేందుకు ఆగస్ట్ చివర్లో డెస్క్ ముందు కూర్చుని ఉన్నప్పుడు గాంధీయవాద సారాంశాన్ని ఎలా పాఠకులకు అర్థం చేయించాలని గింజుకున్నాను. ఆ తర్వాత కాస్సేపటికే ఒక మహా చరిత్ర మన కళ్లముందు ఆవిష్కరించబడింది.

మనలో చాలామంది గాంధీ శకం తర్వాతే పుట్టాము. కాబట్టే స్వాతంత్ర్య పోరాట కాలంలో గాంధీ తాత్విక చింతనల ప్రభావం గురించి మనకు పెద్దగా తెలీదు. గాంధీవాద సారాన్ని గత నెల రోజులుగా కళ్లారా చూడగలిగాము. నిరాడంబరుడైన ఓ వృద్ధ 'యువకుడు' చరిత్ర సృష్టించాడు. ఎవరయినా సరే.. తన పట్ల, తన లక్ష్యం పట్ల నమ్మకం కలిగి ఉంటే అసాధ్యాన్ని సాధ్యం చేయవచ్చని అతడు మనకందరికీ బోధపర్చాడు. ఇది మనం నిజంగా మేల్కొనవలసిన సమయం. మన లక్ష్యాల, ఆశయాల సాధనకు ఇదే తగిన సమయం.

ఈ నెల మనం దసరా, దీపావళి పండుగలు జరుపుకుంటున్నాము. చెడుపై మంచి సాధించిన విజయానికి ఇవి ప్రతీకలు. రావణ వధ అనంతరం రాముడు అయోధ్యకు తిరిగి వచ్చిన ఘటనకు సంకేతం. విజయదశమినాడే దుర్గాదేవి మహిషాసురుడిని ఓడించింది. పాండవులు అజ్ఞాత వాసం తర్వాత తమ ఉనికిని బయటపెట్టింది కూడా ఈ రోజే. కాగా, నరకాసురుడిపై కృష్ణుడు, సత్యభామ సాధించిన విజయానికి, మహావీరుడు నిర్వాణం పొందిన ఘటనకు దీపావళి ప్రతీక. ఈ నేపథ్యంలో, మనలోని చెడు, వ్యతిరేక గుణాలను గుర్తించి, వాటిని అధిగమించడానికి ప్రయత్నించడం ద్వారా మనల్ని మనం సంస్కరించుకోవాలి.

పది భాషలలో చందమామను ఐఫోన్‌లో, ఐపాడ్‌లో ప్రారంభించాము. మా పాఠకులు వీటిని సాదరంగా అందుకున్నారు. ఆండ్రాయిడ్ ఫ్లాట్‌ఫారంపై చందమామను ప్రారంభించడానికి మీ ఆదరణ మాకు తగు ప్రోత్సాహమిస్తోంది. అలాగే మొబైల్ ఫోన్లలో కదిలే బొమ్మల– యానిమేటెడ్– కథలను కూడా మేం ప్రారంభించాము. దీనిపట్ల కూడా పాఠకులనుంచి అదేరకమైన స్పందన వస్తోంది. రాబోయే నెలల్లో చందమామకు సంబంధించిన మరింత సమాచారం అంతర్జాలంలో, మొబైల్‌లో అందుబాటులో ఉంటుందని ఆశిస్తున్నాము. మీ అందరికీ మా బృందం కృతజ్ఞతాభివందనలు.

– సంపాదకులు



# పాఠకుల లేఖలు

ఆగస్ట్ నెల బేతాళకథ 'ధర్మయ్య తీర్పు' చాలా బాగుంది. దేశంలో ఇవ్వాళ రైతులు ఎదుర్కొంటున్న సమస్యలను కథరూపంలో చాలా బాగా మలిచారు. సేద్యంపై రైతుల ఆసక్తిని ఎవరూ చంపకూడదు. మనకాలం రైతాంగ సమస్యను బాగా చిత్రించారు. చిన్న కథలు సైతం చాలా బాగున్నాయి. ఇక 'చందమామతో మా జ్ఞాపకాలు' శీర్షిక ఒక అద్భుతం. – ప్రత్యూష–రాగలీన, తిరుపతి

చందమామకు లేఖ వ్రాస్తుంటే ఆత్మీయుడికి వ్రాసినట్లుంటుంది. పత్రికలో ఏ శీర్షికా తీయవద్దు. కాని ఫోటో వ్యాఖ్యల పోటీ మళ్లీ కొనసాగించండి. సుడోకుని ఆపివేయకండి. ఎందుకంటే ఇది పిల్లల్లో ఆలోచనా శక్తిని పెంచుతుంది. క్విజ్ చాలా బాగుంది. మీరు చేసే కొత్త, మంచి ప్రయోగాలకు మా సహకారం ఎల్లప్పుడూ ఉంటుంది. – పులిజాల రవీందర్ రావు, హైదరాబాద్

మా పాత చందమామని ఏ మార్పులు, లేకుండా సకాలంలో అందించండి చాలు. చందమామ కథలు అంటారే గాని చందమామ శీర్షికలు అనరు. ఇలాంటి వంద శీర్షికలు ఒక్క చిట్టి చందమామ కథకు సరిరావు. చివరి 12 పేజీలు దండుగ. – డా. విజయసాగర్–సీత, జవహరు, నరసరావుపేట

చందమామలో చిట్టిపొట్టి కథలతో పాటు కథలు, సీరియళ్లు చాలా చాలా బాగున్నాయి. మళ్ళీ నెల ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూడవలసి వస్తోంది. – పురం శివశంకర్, హైదరాబాద్

చందమామను గత పదేళ్లుగా చదువుతున్నాము. ఎలాంటి మార్పులూ చేయకండి. ఇలాగే కొనసాగనివ్వండి. 25 ఏళ్లు, 50 ఏళ్ల నాటి కథలను ప్రచురించండి. 'ముగ్గురు మాంత్రికులు' సీరియల్‌ని, పౌరాణిక సీరియల్స్‌ని తిరిగి ప్రచురించండి. కొత్త కంటెంట్ చందమామ సహజత్వానికి భిన్నమైంది. మాకు పాత చందమామే కావాలి. – పురుషోత్తం, పవిత్ర, బీజాపూర్

సుందరమైన వర్ణ చిత్రాలకు, ఆసక్తికరమైన కథలకు పత్రిక విశిష్టమైనది. చందమామ బొమ్మలు ఎంత ఆసక్తికరంగా ఉంటాయో! పౌరాణిక, ఆధునిక కథలు రెండింటినీ ఇష్టంగానే చదువుతుంటాను. మన సంస్కృతిని దాని నిజమైన అర్థంలో పరిరక్షిస్తున్నందుకు అభినందనలు. చందమామ శాశ్వతంగా వెలుగొందాలి, ఎక్కువమంది పాఠకులు దాన్ని చదవాలి. – హరిచరణ్, కరమ్‌వెలి, కేరళ

1957 నుంచి చందమామ పాఠకుణ్ణి. నాడు చందమామ ఖరీదు 36 పైసలు. కొన్ని సీరియల్స్‌ని తిరిగి ప్రచురిస్తున్నారు. కాని 'రూపధరుడి యాత్రలు' సీరియల్ రెండోసారి ప్రచురించలేదు. 'శిథిలాలయం' సీరియల్ పూర్తికాగానే మీరు దీన్ని తప్పక ప్రచురించగలరు.

– ఎస్. జనార్దన్, బెంగళూరు

మా ఇంట్లో ఇటీవల చిన్ని విందు కార్యక్రమానికి వచ్చిన మిత్రులు చందమామలు చూసి చదివి ఇస్తామని పట్టుకు వెళ్ళారు. ఎలా వచ్చింది? ఇండియా నుంచే వచ్చాయా? ఇక్కడ కొన్నారా? అంటూ అడిగారు. ఐతే చందమామ ప్రతులను చూస్తూనే సంతోషంగా, ఆప్యాయంగా తీసుకుని పేజీలు తిప్పి చూడటం, చదవడానికి పట్టుకెళ్లడం మటుకు మంచి అనుభవం.

– జి.లలిత, న్యూజెర్సీ, అమెరికా

# ఎవరికి తగినట్టు వారికి!

కాశీనగరంలో ఒక వర్తకుడికి నలుగురు కొడుకులుండేవారు. వారొకనాడు అడివి కేసి షికారు పోతుండగా, ఒక వేటగాడు బండిమీద వేటమాంసం వేసుకుని వస్తూ ఎదురుపడ్డాడు.

'ఒరే, నాకు కొంచెం మాంసం ఇవ్వరా!' అని పెద్దవాడు వేటగాణ్ణి అధికారపూర్వకంగా అడిగాడు. వేటగాడు జంతువు చర్మం కొంచెం కోసి ఇచ్చాడు.

రెండోవాడు, 'తమ్ముడూ, నాక్కూడా కొంచెం మాంసం పెట్టు!' అన్నాడు.

వేటగాడు తొడమాంసం కోసి ఇచ్చాడు.

మూడోవాడు, 'నాయనా నాక్కూడా మాంసంపెట్టు!' అన్నాడు. వెంటనే వేటగాడు గుండెకాయ ఒకటి తీసి ఇచ్చాడు.

నాలుగోవాడు, 'మిత్రమా, నాక్కూడా మాంసం పెట్టవా?' అని అడిగాడు. వెంటనే వేటగాడు, 'స్నేహితుడా నీ ఇల్లెక్కడ? చెప్పు, నా బండిలో మాంసమంతా మీ ఇంటికి చేర్చుతాను. ఇదంతా నీదే!' అన్నాడు.

'మా నలుగురిలో నువ్వింత వ్యత్యాసం చూపావెందుకు?' అని పెద్దవాడు అడిగాడు.

'ఎవరికి తగినట్టు వారికిచ్చాను, వ్యత్యాసం మీ మాటల్లోనే ఉంది. నాలో లేదు!' అన్నాడు వేటగాడు.

వాళ్ళు సంతోషించి అతడిని తీసుకుపోయి, తమ నౌకరుగా పెట్టుకున్నారు.



Avail the loyalty bonus!

Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions - within India)



Chandamama!

Because stories make the world go round...

Choose your Chandamama!

Go to www.chandamamashop.com & subscribe Now!!



You can also subscribe online at: **www.chandamamashop.com**

**Chandamama is available in English and 12 regional languages. Junior Chandamama for children above 4 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior (Only in English)

Name: ..............................................................................................

Date of Birth: .............................. Sex :......................................

Address: ..........................................................................................

..........................................................................................................

..........................................................................................................

....................................................... City: .........................................

State:......................................... Pin:..................................................

Telephone:.......................................................................................

Mobile:.............................................................................................

Email:...............................................................................................

Subscription Number (for renewals):.............................................

Gift Subscription to the following address:

..........................................................................................................

..........................................................................................................

..........................................................................................................

..........................................................................................................

Enclosed Cheque/DD* for Rupees.................................................

Cheque/DD No ...............................................................................

favouring Chandamama India Ltd on.............................................

.........................................................................................bank.

* Your subscription will commence in 6 weeks.
Please mail the subscription form to:
**Chandamama India Limited,**
P.O.Box No:19407, Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at : www.chandamamashop.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 190 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 35 | Rs. 80 | Rs. 145 | Rs. 225 |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# చందమామతో నా జ్ఞాపకాలు - 1

చందమామ చదవకుంటే..! కోకిలమ్మ పాడకుంటే..!! నెమలిఈక చూడకుంటే...!!! నేతిగారె తినకుంటే...!!!! నీతికథలు వినకుంటే...!!!!! ఏం జరుగుతుంది?

పక్షులకు, పశువులకు, మృగాలకు లేని ఒక ప్రత్యేకత మానవునికి ఉంది. అదే విచక్షణ. ఏది మంచి? ఏది చెడు? అని చెప్పగలిగిన శక్తి ఒక్కమనిషికే ఉన్నది. తతిమ్మా జాతులంతా స్వాభావికంగా ప్రవర్తిస్తూ ఉంటాయి. మానవుడు సంఘజీవి. తోటివారిపట్ల ఎలా నడచుకోవాలి? ఇతరులు ఏవిధంగా ఉంటే మనకు సంతోషం? అనేవి నేర్పేవే నీతికథలు.

'పంచతంత్ర' కథలను రాజుగారి సోమరిపోతు పుత్రులు విని ఉత్తములైనారు. కథలు ఎటువంటివారినైనా ఆకర్షిస్తాయి. మంచి మార్గాన్ని చూపిస్తూనే.. దుర్మార్గులు, దుష్టులు, ధర్మభ్రష్టులు, ఏవిధంగా అపకీర్తి పొందారో భారత, రామాయణాలు చెప్తాయి. విష్ణుశర్మ చెప్పిన కథల్లో పక్షులు, పశువులు నిజంగా మాట్లాడతాయా లేదా అనేది ప్రశ్న కాదు, వాటి సంభాషణ ద్వారా మనం ఏమి నేర్చుకోవాలి అనేదే ప్రశ్న. ఆకోవకు చెందినదే మన 'అందాల చందమామ.'

గోరుముద్దలు పెడుతూ మంచి బుద్ధులు నేర్పుతుంది అమ్మ. పసిపిల్లలకు మంచి చెడులు నేర్పుతూ నీతిముద్దలు పెడుతుంది చందమామ. అందుకనే ఆబాల గోపాలమూ మెచ్చేపత్రిక ముఖ్యంగా పిల్లలకు నచ్చేపత్రిక. వెలసులభము. ఫలమధికము. ఇలా ఎంతైనా వ్రాయవచ్చు. చదివితే కథలెంత మధురమో, చిత్రాలు చూస్తే కళ్ళకు, మనస్సుకు అంత ఆనందం. చందమామ పత్రికను చూడగానే కొనని వారుండరు. అది అందించే పటిక బెల్లాన్ని తినని వారుండరు.

మా అబ్బాయి, అమ్మాయి, పసివాళ్ళుగ ఉన్నపుడు 'శిళ్ళంగేరి గ్రామంలో...' అని మొదలయ్యే కథలు చదువుతూ, రాత్రి నిద్రించేవారు. ఇపుడు అమ్మాయికి 37 ఏళ్ళు, అబ్బాయికి 35 ఏళ్ళూ, ఇద్దరూ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లే, ఐనా ఈనాటికీ చందమామ చదవాల్సిందే! అమెరికా చికాగోలో ఉంటున్న మా అబ్బాయి సైతం మొన్న బెంగుళూరు వచ్చినపుడు 'శిళ్ళంగేరి' రచయిత, కోలార్ కృష్ణయ్యర్ గారి కథల గురించీ మాట్లాడుకున్నాం.

నేను ముఖస్తుతికి ఈమాటలు అనడంలేదు. ఆ అమృతాన్ని గ్రోలుతూ, అనుభవిస్తూ, వ్రాస్తున్న మాటలివి. చిన్నపిల్లలతోపాటుగా పెద్దలకూ మానవత్వపు విలువలను, మంచితనాన్నీ, సద్గుణాలనూ గుర్తుచేసే పత్రిక చందమామ.

అప్పటినుండీ (1947) ఇప్పటివరకూ నిరాటంకంగా, నిర్విరామంగా, పత్రికకై చేస్తున్న కృషికి, సంపాదక వర్గానికీ, సహకరించే సిబ్బందికీ సవినయంగా నమస్సుమాంజలులు సమర్పిస్తున్నాను.

చంద్రునికాంతి లోకానికి అందినంతకాలం 'చందమామ' పత్రిక నిలవాలని, నిత్యం వెలగాలనీ, ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ ముగిస్తున్నాను.

*– ఆదూరి శ్రీనివాసరావు, లెక్చరర్, సత్యసాయి ఇన్‌స్టిట్యూట్, బెంగళూరు*

# చందమామతో నా జ్ఞాపకాలు - 2

మీ పత్రిక ద్వారా, ఇంగ్లీష్ వాడినైన నేను హిందీ నేర్చుకోవడంలో చాలా సహాయం పొంద గలిగాను. నేను ఇప్పుడు ఆస్ట్రేలియాలో హిందీ భాష నేర్చుకుంటున్నాను. హిందీ భాష నేర్చుకోవడం నాకు మొదట్లో కొంచెం కష్టంగా తోచింది. కాని నా 'పూజ్య గురుదేవ్' నాకు చందమామ సంచికను ఇచ్చి దానిద్వారా హిందీ నేర్చుకోమన్నారు. ఆయన ప్రసాదించిన ఈ ఆలోచనాత్మకమైన బహుమతి నా అధ్యయనాన్ని మరింత సులభతరం చేసింది. నిజం చెబుతున్నా.. చందమామలో నేను చదివిన కథలవంటివి నా జీవితంలో ఇంతవరకు నేను చూడలేదు.

బహుశా, నాకు తప్ప ఈ ఆస్ట్రేలియాలో 'బేతాళ కథలు' గురించి ఎవరికీ తెలియదను కుంటున్నాను. మీవల్లే నేను ఇలాంటి కథలు తెలుసుకోగలుగుతున్నాను. మీ పత్రిక వల్లే నేనిప్పుడు హిందీని బాగా అర్థం చేసుకుంటున్నాను. గడచిన 45 ఏళ్ళకాలంలోనేను పెద్దగా నేర్చుకోలేకపోయాను. కాని గత మూడేళ్ళనుంచి ఇద్దరు పరమ గురువులు, చందమామ ద్వారా నా జీవితంలో నూతన ద్వారాలు తెరుచుకున్నాయి.

అందుకే, చందమామ ప్రియపాఠకులకు నేను ఒక విషయం చెప్పాలనుకుంటున్నాను. వయోవృద్ధుడినైన నేనే చందమామ ద్వారా ఒక భాష నేర్చుకోగలిగినప్పుడు.. మీకెందుకు సాధ్యపడదు. గుర్తుంచుకోండి. హిందీ ప్రపంచంలో అతి సుందరభాష.

నా ఈ ఉత్తరం ముగించడానికి ముందుగా నా గురువులపేర్లు వెల్లడించాలనుకుంటున్నాను. దీపాతక్కర్ అనే ఒక గుజరాతీ మహిళ హిందీ అక్షరమాలను, అక్షరాలను సరిగా ఉచ్చరించ డాన్ని, అనేక పదాలను రూపొందించడాన్ని నాకు నేర్పించారు. ఆమె ఈరోజుకీ సిడ్నీలో టెలి ఫోన్ ద్వారా నాకు హిందీ నేర్చుకోవడంలో శిక్షణ ఇస్తున్నారు. సోదరీ, మీకు నా కృతజ్ఞతలు!

ఇప్పుడు నా ప్రధాన గురువు విద్యాసాగర్ పట్టన్. ఈయనే నాకు తొలిసారిగా చందమామను పరిచయం చేశారు. ఇది నా జ్ఞానాన్ని మరింతగా మెరుగుపర్చింది. ఈ సందర్భంగా, వయసులో చిన్నవాడైన నా గురువుకి నా ఆశీర్వాదాలు.

ప్రియమైన చందమామా...! నీకు ముమ్మారు కృతజ్ఞతలు. నీవు చేపడుతున్న ఈ మంచి కృషిని మరో వంద సంవత్సరాలు కొనసాగించాలని ప్రార్థిస్తున్నాను.

*- ఆండ్రూ హెవెట్, మెల్‌బోర్న్, సిడ్నీ, ఆస్ట్రేలియా-3071*

Request to readers: Contributors of stories, memories are requested to send in their entries with their complete name, address, phone no and other contact details to enable us to get back to you.

Write to us:

**Chandamama India Ltd.,** No:2 Ground Floor, Swathi Enclave,
Amman koil street, Vadapalani, Chennai-600026.

● Phone: 044-43992828 ● Email : online@chandamama.com



బేతాళ కథలు

# పచ్చల హారం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా స్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, 'రాజా నీవు పడుతున్న ఈ కష్టానికంతటికీ ఏదైనా అతీత శక్తి కలిగిన వస్తువు నుంచి లబ్ధిపొందగోరు తున్నావేమోనని నాకు ఆశ్చర్యం వేస్తోంది. కానీ, అలాంటి మహిమ కలిగిన వస్తు వులు వాటి యజమానుల్లాగే అనూహ్య రీతుల్లో వ్యవహరిస్తుంటాయి. అత్యంత నిజాయితీపరులు కూడా ఇలాంటి వస్తు వుల కారణంగా దుష్ప్రభావాలకు గురై తమ వివేచనాశక్తిని పోగొట్టుకుంటుం టారు. ఇలాంటి వస్తువును పొంది, దాని శక్తి కారణంగా శివచంద్రుడనే రాజు ఇక్కట్ల పాలై, దాన్ని తన స్నేహితుడికి అప్పగించి తప్పించుకున్నాడు. చివరకు ఆ వస్తువు కూడా రాజు స్నేహితుడిపై అనుకోని ప్రభావం చూపింది. శ్రమ తెలియకుండా



ఉండేందుకు నీకా కథ చెబుతాను విను,' అంటూ ఇలా చెప్పసాగాడు.

కాళిందీ రాజ్యంలో చంద్రయ్య అనే గొర్రెల కాపరి ఉండేవాడు. అతను ప్రతి రోజూ గొర్రెలను మేపడానికి పచ్చిక కొండ దగ్గరకు వెళ్లేవాడు. ఒక రోజు సాయంత్రం అతడు గొర్రెల మందతో ఇంటిముఖం పట్టాడు. అంతలో ఒక చిన్న గొర్రెపిల్ల మందనుంచి దూరమై ఒక పాడుపడిన బావిలో పడిపోయింది.

గొర్రె పిల్ల అరుపులు విన్న చంద్రయ్య దాన్ని వెదుక్కుంటూ పాడుబడ్డ బావి చేరాడు. అందులో పడ్డ గొర్రెపిల్లను చూసి మెల్లగా బావి మెట్లు దిగి, దాన్ని దొరకబుచ్చుకుని వస్తుండగా, దారిలో ఒక హారం కనిపించింది. మట్టిపట్టి ఉండడంతో అది బంగారమో కాదో తెలియకపోవడంతో, చంద్రయ్య ఆ హారం అందుకుని జేబులో వేసుకుని, గొర్రెల మందతో ఇల్లు చేరాడు.

మరునాడు ఆ హారాన్ని కంసాలి దగ్గరకు తీసుకుపోయి చూపించాడు. కంసాలి ఆ హారాన్ని పరీక్షించి, 'చంద్రయ్యా, నీ పంట పండింది. ఇది ఖరీదైనపచ్చలహారం. ఎంత లేదన్నా దీని విలువ పాతికవేల వరహాలు ఉంటుంది' అని చెప్పాడు.

చంద్రయ్య ఆ హారం ఎవరికైనా అమ్మాలని భావించి ఇంటి దగ్గర దాచిపెట్టాడు. వారం గడిచేసరికి చంద్రయ్య గొర్రెలు ఒకటొకటి చనిపోసాగాయి. అంతవరకు ఎప్పుడూ గుండ్రాయిలా ఉండే అతడి భార్యకు జబ్బు చేసి మంచం పట్టింది.

ఆలోచించిన చంద్రయ్యకు అదంతా తనకు దొరికిన పచ్చల హారం తాలూకు దోష గుణం అనిపించింది. అది అమ్మగా వచ్చిన డబ్బు కూడా అలాంటి హాని చేస్తుందని భావించిన చంద్రయ్య దాన్ని ఎలా వదిలించుకోవాలా? అని ఆలోచించాడు.

చంద్రయ్యకు పచ్చల హారం దొరికిన వైనం ఊరంతా పాకింది. చెంచురాముడు అనే దొంగకావిషయం తెలిసింది. వాడు దాన్ని ఎలాగైనా దొంగిలించాలని యోచించాడు. ఒక రాత్రి వాడు పిల్లిలా చంద్రయ్య ఇంట్లో దూరాడు. పాము చెవులు కలిగిన చంద్రయ్యకు దొంగ, తన గుడిసెలోదూరిన సంగతి తెలిసింది. హారం కోసమే వాడు వచ్చి ఉంటాడని ఊహించిన చంద్రయ్య

దాని పీడ విరగడవుతుందని మనసులో సంతోషించి మిన్నకుండిపోయాడు.

చెంచురాముడు హారం దొరికిన ఆనందంతో తన ముఠా దొంగలు ఉండే పాడుబడ్డ కొట్టం చేరాడు. పచ్చల హారం వాడికి దొరికినంతనే దాని దుష్ప్రభావం వాడిమీద పడింది. వాడికి, తోటి దొంగలకు పచ్చల హారం పంపకం విషయంలో గొడవైంది. కోపం తెచ్చుకున్న ఒక దొంగ చురకత్తితో చెంచురాముడిమీద దాడి చేశాడు.

వాడి చేతికి బలమైన గాయం అయింది. అంతలో అటుగా సంచరిస్తున్న కొత్వాల్ చెవిన పడిందా గొడవ. కొత్వాల్ కత్తి దూసి వాళ్ల మీదకు ఉరికాడు. అప్రమత్తులైన దొంగలు పారిపోగలిగారు గాని, గాయం పాలైన చెంచురాముడు మాత్రం దొరికిపోయాడు.

అంతవరకూ తోటి దొంగలతో గొడవ రావడం గాని, గాయాల పాలవడం కాని, రక్షక భటులకు దొరికిపోవడం కానీ ఎరుగని చెంచురాముడికి అదంతా హారం వలననే అని సందేహం కలిగింది. వాడా హారం కొత్వాల్ కంటపడకుండా దాచగలిగి కూడా అలా చేయక, కొత్వాల్ మీద అక్కసుతో ఆ హారం అతడికి అప్పగించాడు. కొత్వాల్ చెంచురాముడిని కారాగారంలో బంధించి, వాడి ద్వారా తనకు లభించిన పచ్చల హారాన్ని భార్య మెడలో అలంకరించాడు.

వారం తిరిగే సరికి కొత్వాల్ని పాము కాటేసింది. వైద్యం చేయించుకుని కాస్త తెరిపిన పడేసరికి అతడి కొడుకు తిరునాళ్ళలో తప్పిపోయాడు. ఎంతవెదికినా దొరకలేదు. 'ఈ పచ్చలహారం వచ్చాకే మనకు శని పట్టింది,' అని కొత్వాల్ భార్య





తన మెడలోని పచ్చల హారం తీసి దూరంగా విసిరి కొట్టింది. కొత్వాల్‌కి కూడా అది నిజమే అనిపించింది. అయితే ఆ పచ్చలహారం పారేయబుద్ధి కాలేదు. అలాగని అమ్మడా నికి ధైర్యం చాలటం లేదు. అందుకే కొత్వాల్ బాగా ఆలోచించి దాన్ని తరచూ తనకు పని పడే జమీందారుగారికి కానుకగా ఇచ్చాడు. అది వదిలించుకున్న తర్వాత కొత్వాలుకి తప్పిపోయిన కొడుకు దొరికాడు.

పచ్చల హారం జమీందారుగారింటికి చేరినంతనే అతని దగ్గర పెద్ద మొత్తంలో అప్పు పుచ్చుకున్న వ్యక్తి కాలం చేశాడు. ఆ డబ్బు మరిక తిరిగిరాదని జమీందారు దిగాలు పడ్డాడు. అంతలో అతని కూతు రుకి పిచ్చి పట్టింది. జమీందారుకు అదంతా పచ్చలహారం ప్రభావమేననిపించింది.

అతడు కూడా దాన్ని వదిలించుకోవాల నుకున్నాడు. 'తనకు కలిసి రానంత మాత్రాన మరొకరికి కలిసిరాకపోతుందా?' అని భావించిన జమీందారు దాన్ని మహా రాణి జన్మదిన సందర్భాన, మహారాజు శివచంద్రుడికి కానుకగా అందించాడు.

ఆ పచ్చల హారం పనితనం చూసిన మహారాణి ఆనందంగా మెడలో అలంరిం చుకుంది. పక్షం తిరిగేసరికి పొరుగు రాజైన జయవర్ధనుడు తన రాజ్యం మీద దాడి చేయబోతున్నాడని వేగుల ద్వారా శివ చంద్రుడికి తెలిసింది.

అతను జయవర్ధనుడిని ఎదుర్కోవడా నికి సైన్యం సమాయత్తం చేస్తుండగా ఆ రాజ్యం సర్వసైన్యాధికారి విక్రమకాంతుడికి విషజ్వరం సోకింది. అది దుశ్శకునంగా భావించిన శివచంద్రుడు జ్యోతిష్కులను పిలిపించాడు.

గ్రహస్థితులు లెక్క గట్టిన జ్యోతిష్కులు 'రాజా, మీ అంతఃపురాన కొత్తగా చేరిన ఆభ రణాలు గానీ, వ్యక్తులు గానీ, జంతువులు గానీ ఏవైనా ఉన్నాయా? అని అడిగారు.

కొద్ది క్షణాలు ఆలోచించిన మహారాజు పచ్చలహారం గురించి చెప్పాడు.

అప్పుడు జ్యోతిష్కులు 'మహారాజా! ఇదంతా దాని దుష్ప్రభావమే. దాన్ని ఎంత తొందరగా వదిలించుకుంటే అంతమం చింది,' అని చెప్పారు. శివచంద్రుడు ఆ పచ్చల హారం ఎవరినుంచి ఎవరికి మారి తనకు చేరిందో ఆరా తీయించాడు.

పచ్చల హారం గౌరైల కాపరికి పాడుబడ్డ బావిలో దొరకడం నుంచి దొంగ దగ్గరకు, వాడినుంచి కొత్వాలుకు, కొత్వాల్ నుంచి జమీందారుకి, జమీందారు నుంచి మహారాణికి చేరడం గురించి తెలిసింది. అది వదిలించుకున్నాక పరిస్థితులు చక్కబడటం గురించి కూడా తెలిసింది.

సుదీర్ఘంగా ఆలోచించిన శివచంద్రుడు, ఆ పచ్చల హారాన్ని తన మిత్రుడైన సాగరభూషితుడికి కానుకగా ఇవ్వదలిచాడు. అది తెలిసిన మహారాణి, 'రాజా! ఈ పచ్చల హారం తమ చెంతనుండగా అందరూ కష్టాల పాలయ్యారు. దాని దుష్ప్రభావం మనం కూడా చవిచూశాం. మీ మిత్రుడైన సాగరభూషితుడు ఒకప్పుడు పేరొందిన సముద్ర వ్యాపారి. అతని నౌకలు సముద్రంలో మునిగిపోయి, అప్పుల పాలై అష్టకష్టాలు పడుతున్నాడు. అతను అనారోగ్యం పాలయ్యాడు కూడా. మన క్షేమం కోసం పచ్చల హారం అతడికిచ్చి అతడిని మరింత కష్టాల పాలు చేయడం ఎంతవరకు సమంజసం? ఇంతవరకు మీరు ధర్మప్రభువుగా కీర్తి గడించారు. ఎన్ని సమస్యలు వచ్చినా ధర్మపథం వీడలేదు. ఇప్పుడు కూడా ధర్మాన్ని ఆచరించి మీ మిత్రుడిని ఇక్కట్లపాలు చేయకండి,' అని సలహా ఇచ్చింది.

మహారాణి చెప్పింది సావకాశంగా విన్న మహారాజు చిన్నగా నవ్వాడు. మరునాడు సాగరభూషితుడిని రప్పించి తన దగ్గరున్న పచ్చల హారం బహుమతిగా ఇచ్చాడు.



కొద్ది రోజుల్లోనే కాళిందీ రాజ్యం సర్వసైన్యాధిపతి విషజ్వరం బారినుంచి కోలుకుని సమరోన్ముఖుడయ్యాడు. ఎందుకనో, శత్రు రాజు జయవర్ధనుడు వెనుకంజ వేసి యుద్ధ ప్రయత్నం మానుకున్నాడు.

అంతే కాదు– చిత్రంగా సాగరభూషితుడు మొదలుపెట్టిన చిన్న వ్యాపారం పెద్దదై అతను ఏడాది తిరిగేసరికి పూర్వస్థితికి చేరుకున్నాడు.

అంతవరకూ కథ చెప్పిన బేతాళుడు, 'రాజా, పచ్చల హారం ఎవరి దగ్గరుంటే వాళ్ళు ఆరోగ్యం చెడి సంపద పోగొట్టుకుని అష్ట కష్టాలు అనుభవించారు, అది తెలిసి కూడా మహారాజు ఆ పచ్చల హారాన్ని తన మిత్రుడికి ఇవ్వాలనుకోవడం మిత్రద్రోహం కాదా? మహారాణీ మాటలను బట్టి శివ

చంద్రుడు ధర్మప్రభువు అని తెలుస్తున్నది. అంతటి ధర్మమూర్తి అటువంటి నీచకార్యానికి ఎందుకు ఒడిగట్టాడు? మరొక చిత్రమైన విషయం ఏమిటంటే, అందరిపై దుష్ప్రభావం చూపిన పచ్చల హారం సాగరభూషితుడిని చేరినంతనే ఎందుకు సకల సంపదలు కలిగించింది? దాని దుష్ప్రభావం తెలుసుకున్న సాగరభూషితుడు ఏవైనా శాంతులు జరిపించడం, లేక మరెవరికైనా అంటగట్టడం చేసి ఉంటాడా? ఈ సందేహానికి కారణం తెలిసి కూడా చెప్పకపోయావంటే నీ తల వెయ్యి తునకలవుతుంది' అన్నాడు.

అందుకు విక్రమార్కుడు, 'బేతాళా! పచ్చల హారం ఎవరిదగ్గర ఉంటే వారి స్థితిగతులను అది మారుస్తుంది. ఆరోగ్యంగా ఉన్నవారు అనారోగ్యం పాలవడం, సుఖాల్లో ఉన్నవారు కష్టాల పాలవడం జరుగుతుంది. మహారాజు మిత్రుడు సాగరభూషితుడి పరిస్థితి ఏమంటే వ్యాపారంలో నష్టపోయి, అనారోగ్యంతో బాధపడుతూ, అష్టకష్టాలు పడుతున్నాడు. మంచి స్థితిలో ఉన్న వారికి హాని కలిగించే పచ్చల హారం, చెడ్డ పరిస్థితుల్లో ఉన్న వారికి మంచి చేయగలదన్న సునిశిత దృష్టితోనే మహారాజు దాన్ని తన మిత్రుడైన సాగరభూషితుడికి కానుకగా ఇచ్చాడు. అతడు ఊహించినట్లే సాగరభూషితుడికి పట్టిన అనారోగ్యం, కష్టాలు వదిలిపోయాయి. ఆరోగ్యం, సంపదలూ చేకూరాయి. అందువలన ఇందులో మిత్రద్రోహం ప్రసక్తి లేదు. అలానే మహారాజు ధర్మం వీడి ప్రవర్తించడం జరగలేదు. అసలీ సంగతులేవీ తెలియని సాగరభూషితుడు పచ్చలహారానికి శాంతి జరిపించడం కానీ, మరొకరికి అంటగట్టడం గానీ జరిగే ప్రసక్తే లేదు,' అని చెప్పాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగమై, సరైన సమాధానం రావడంతో బేతాళుడు మరలా చెట్టెక్కాడు. (కల్పితం)

(ఆధారం: ఎన్ శివనాగేశ్వరరావు)






# పదహారువేల రూపాయలు

గన్నవరంలో గవర్రాజు ఒక గృహస్తు. వెంకటేశం, శోభనాద్రీ అని ఆయనకు ఇద్దరు స్నేహితులు ఉండేవారు.

గవర్రాజు ధనవంతుడు. ఈ సంగతి కనిపెట్టే వెంకటేశం, శోభనాద్రి ఆయనతో స్నేహం చేశారు. 'మీ డబ్బును పెట్టెలో పెట్టి దాస్తే ఏమిటి లాభం? దాన్ని పెట్టు బడిగా పెట్టి వ్యాపారం చేస్తే, రూపాయకు పదిరూపాయలు చొప్పున లాభం వస్తుంది' అని సలహా చెప్పారు. 'నాకు ఏ వ్యాపారమూ చేతకాదు.' అన్నాడు గవర్రాజు. 'మీరు పెట్టుబడి పెట్టండి, వ్యాపారమంతా మేము నడుపుతాము,' అన్నారు వాళ్లు.

గవర్రాజు సొమ్ముతో వ్యాపారం ప్రారంభమయింది. స్నేహితులనిద్దరినీ నమ్మి, ఆయన అంతా వాళ్లపైన వదిలి పెట్టేశాడు. వాళ్లు అసలూ, లాభమూ అపహరించి వేసి, వ్యాపారంలో నష్టం చెప్పి ఆయనను దివాలా తీయించారు.

తన సొమ్ము అపహరించి, చెరి ఒక ఐదు వేలూ బ్యాంకులో వేసుకున్నారని గవర్రాజుకి ఆఖరున గాని తెలిసింది కాదు. వారు తనకు ద్రోహం చేశారని తెలిసి కూడా ఆయన వాళ్లనేమీ అన లేదు. వాళ్లను ఎప్పటిలాగే స్నేహభావంతోనే చూస్తూవచ్చాడు.

కొంతకాలానికి ఆయనకు జబ్బు చేసి మంచంపట్టాడు. ఇంక ఎన్నాళ్లో బ్రతకనని తోచి ఆయన శోభనాద్రిని రమ్మని కబురు పంపించాడు. అతడు రావడంతోనే ఆయన 'శోభనాద్రి! నువ్వు నాకొక ఉపకారం చేసి పెట్టాలోయ్,' అన్నాడు.

వై. జయలక్ష్మి



'ఏమిటి?' అని అడిగాడు శోభనాద్రి.

'నా రోజులు దగ్గిరపడ్డాయి. నేను పోయేముందు ఏ సొమ్ము ఎక్కడ ఉన్నదీ నా భార్యకు చెప్పవలసిన సమయం వచ్చింది. కాని, మా ఆవిడ వట్టి దుబారా మనిషి, సొమ్ము చేతికి వస్తే మూడు నిమిషాలలో ఖర్చు చేసేస్తుంది,' అన్నాడు.

ఆయన వద్ద ఇంకా సొమ్ము ఉందని తెలియడంతో శోభనాద్రికి నోరూరింది. ఇన్నాళ్ల నుంచి చెప్పాడు కాదే అనుకుని 'నిజమే ఆడదాని చేతి అర్థమూ, మగ వాని చేతి బిడ్డా మన్నవు అన్న సౌమ్యం ఊరికే పుట్టిందా?' అన్నాడు.

'వ్యాపారంలో పోయింది పోగా నా వద్ద ఇంకా పదహారువేల దాకా ఉంది. ఆ రూపాయలను వెయ్యి వెయ్యి చొప్పున ముంతలలో పోసి, మాయింటి నాలుగు గదులలోనూ ఒక్కొక్క ముంత ఒక్కొక్క మూలని పాతిపెట్టాను. పదహారు ముంత లున్నాయని నా భార్యకు ఒక్కమాటుగా తెలియనివ్వకూడదు. నువ్వు చెయ్యావ లసిన ఉపకారమేమిటంటే..' అని ఊరు కున్నాడు గవర్రాజు.

'చెప్పండి, చెప్పండి!' అంటూ తొందర పెట్టాడు శోభనాద్రి.

'మధ్య మధ్య మా ఇంటి పరిస్థితులు కనుక్కుని వెడుతూ ఉండు. నా భార్య డబ్బు లేక ఇబ్బంది పడుతోంది అని తెలి యడంతోనే ఒక ముంత మాట చెప్పి ఆ సొమ్ము తవ్వుకోమను. ఆ సొమ్ము పూర్తి అయేవరకూ దానికి తక్కిన ముంతల మాట చెప్పవద్దు,' అన్నాడు గవర్రాజు.

'ఈ ముంతల రహస్యం నువ్వు ఎవరికీ తెలవనివ్వకూడదు. వెంకటేశానికి కూడా చెప్పకు. వాడిపై నమ్మకం పోయింది. అందుకే నీతో చెప్పి, ఈ ఉపకారం చెయ్యా వలసిందని కోరుతున్నాను,' అని కూడా అన్నాడు గవర్రాజు.

'తప్పకుండా చేస్తాను. మీరు నన్ను నమ్ముకుని ఇంక నిశ్చింతగా ఉండ వచ్చు. ఈపాటి దానికేనా ఇంత మాత్రం!' అని చెప్పి, శోభనాద్రి వెళ్లిపోయాడు. ఆ సాయంత్రమే గవర్రాజు తన రెండవ

స్నేహితుడైన వెంకటేశాన్ని రప్పించి, ఆ ముంతల రహస్యాన్ని వాడితో కూడా చెప్పాడు. శోభనాద్రిని కోరినట్లే, 'ఈ ఉపకారం నాకు నువ్వు చెయ్యాలి. ఈ రహస్యాన్ని నువ్వు శోభనాద్రికి కూడా తెలియనివ్వకూడదు. వాడంటే నాకు ఏమాత్రం నమ్మకం లేకనే నీకు కబురు చేయించాను,' అన్నాడు.

'వాడికెందుకు తెలవనిస్తాను? ఇంక మీరు నిశ్చింతగా ఉండవచ్చు. వ్యవహారమంతా నేను చూసుకుంటాను,' అని నమ్మకంగా అన్నాడు వెంకటేశం.

కొన్నాళ్లకు గవర్రాజు చనిపోయాడు. ఆ తర్వాత ఒక రోజు కావమ్మ శోభనాద్రితో, 'డబ్బుకు ఇబ్బందిగా ఉంది. పాతిక రూపాయలు కావాలి,' అని అడిగింది.

'నాదగ్గిర సొమ్ము ఎక్కడిది? అంతే కాకుండా మీరు మాత్రం అప్పు చేసి ఎన్నాళ్లు గడపగలరు? మీ ఇల్లు అమ్మేస్తే ఒకవెయ్యి రూపాయలు వస్తుందే. అలా చెయ్యకూడదా?' అన్నాడు శోభనాద్రి.

'నాకీ ఆలోచన తోచిందే కాదు. అమ్మేటట్లయితే రాత్రి నిశ్చయించుకు చెబుతాను,' అన్నది ఆవిడ. ఈ సంగతి ఇలా ఉండగా, ఆ సాయంత్రమే వారింటికి వెంకటేశం వెళ్లాడు.

'శోభనాద్రి ఇల్లు అమ్మితే వెయ్యిరూపాయలు వస్తుందన్నాడు,' అని ఆవిడ




ఆ సంగతి అతడితో చెప్పింది. అందుకు వెంకటేశం, 'వెయ్యేమిటి? మీరే అమ్మదలుచుకుంటే నేను పదిహేను వందలిస్తాను,' అన్నాడు.

మర్నాడు పొద్దుట మళ్లీ వచ్చిన శోభనాద్రితో కావమ్మ వెంకటేశం సంగతి చెప్పింది.

'నేను రెండువేలిస్తాను,' అన్నాడు శోభనాద్రి. పదహారు వేల రూపాయలు ముంతలలో ఉన్న ఇంటిని రెండు వేలిచ్చి కొంటే నష్టమేమిటి గనుక?

మామూలు ప్రకారం ఆ సాయంత్రం వచ్చిన వెంకటేశం రెండు వేల ఐదువందల వరకూ ఇస్తానన్నాడు. ఈ విధంగా రోజురోజుకీ వాళ్లిద్దరి మధ్యా పోటీ వచ్చి

పాట పెరిగింది. ఆఖరికి శోభనాద్రి పదివేలు ఇస్తానన్నాడు. పదహారు వేల రూపాయలలో పదివేలు పోతే ఆరు వేలున్నాయిగా మరి!

కావమ్మ తెలివితక్కువది కాదు. వెంక టేశం ఇంకా ఏమైనా ధర పెంచుతా డేమో అని చూసింది.

వెంకటేశం ధర పెంచలేదు. శోభనా ద్రిని కలుసుకుని, 'ఏమిరా, ఆ ఇంటికి పదివేలిస్తానన్నావుట! ఏం పాముకుం దామని?' అన్నాడు మందలిస్తూ.

'నువ్వేం పాముకుందామని ధర పెంచావు?' అని ముదలకించాడు శోభ నాద్రి.

వాళ్లు ఒకళ్లనొకళ్లు చూసి చిరునవ్వు నవ్వుకున్నారు. అసలు రహస్యం వాడికె లాగో తెలిసిపోయిందని వీడూ, వీడికె లాగో తెలిసిపోయిందని వాడూ గ్రహిం చారు.

ఆఖరికి వెంకటేశం, 'పదివేలు ఎక్కడి నుంచి తెస్తావు? బ్యాంకులో నీకు ఐదు వేలే కదూ ఉన్నాయి?' అన్నాడు.

'నీకు కూడా బ్యాంకులో ఐదువేలు న్నాయిగా? ఆ సొమ్ము నాకు బదు లియ్యి. వారంలో తీర్చేస్తాను,' అన్నాడు శోభనాద్రి. 'అదేమీ కుదరదు. నీ ఐదు వేలూ, నా ఐదువేలూ చేర్చి, ఆ ఇంటిని మనిద్దరిపైనా రాయించుకుందాం,' అన్నాడు వెంకటేశం, 'సరే' అన్నాడు శోభనాద్రి.

అదివరలో గవర్రాజుకు ద్రోహం చేసి అపహరించిన ఆ పదివేలూ తెచ్చి వాళ్లి ద్దరూ కావమ్మగారి ఒడిలో పోసి, ఇల్లు రాయించుకున్నారు.

తరువాత వాళ్లిద్దరూ చెరి ఒక గునపం చేత పుచ్చుకుని గది మూలలు తవ్వటం మొదలెట్టారు. ఎంత తవ్వినా ఒక్క ముంతయినా కనిపిస్తేగా?





# మతాబుల మతలబు

మాధవయ్య గుమ్మంలో అడుగుపెట్టగానే చేతన, చిన్మయ వచ్చి, 'చూడండి తాతగారూ! మా స్నేహితులంతా బోల్డుబోల్డు, మతాబులు, చిచ్చుబుడ్లు, టపాసులు కొనుక్కుంటే నాన్న ఈ ఏడూ ఏమీ కొనరట!, ఇప్పటివరకూ మేం చిన్నవాళ్ళమని కేవలం కాకర పువ్వొత్తులు మాత్రమే కొనేవారు, ఇప్పుడు పెద్దయ్యాం, పదేళ్ళొచ్చాయి, మీరన్నా చెప్పరా! తాతగారూ!' అంటూ ఆయన కాళ్ళు చుట్టేసుకున్నారు. వాళ్ళమ్మ అనసూయమ్మ 'ఉండండ్రా! తాతగారిని లోపలికి రానివ్వండి, మీ పితూరీలు గుమ్మంలోనే మొదలెట్టేశారా?' అంటూ వారిని వారించింది.

మాధవయ్య వారిద్దరినీ లోనికి తీసుకెళ్ళి 'మీకు డబ్బులతో కొనక్కరలేని ఢాం టపాసులూ, అంటించకుండానే పూలు చిమ్మే చిచ్చుబుడ్లూ, వెలిగించకుండానే వెలిగిపోయే వెండితీగలూ, ఇంకా చాలా చాలా మతాబులు చూపుతాను సరా!' అనివారికి పల్లెనుండీ వాళ్ళ బామ్మ స్వయంగా చేసి పంపిన దీపావళి మిఠాయిలు అందించాడు. పిల్లలిద్దరూ మిఠాయిలు చేతికి అందగానే అన్నీమరచి అవి తినడంలో పడ్డారు.

'అమ్మా! అనసూయా! ముందుగా అనుకున్నట్లే పిల్లలిద్దరినీ దీపావళికి నా వెంట తీసుకెళ్ళనే వచ్చాను, మరునాడే తెచ్చి దింపుతాను,' అని చెప్పి, ఆమె ముందుగానే సర్ది ఉంచిన వారి బట్టల సంచీతో మాధవయ్య పిల్లలతో కార్లో బయల్దేరాడు. కారు సాగగానే 'తాతగారూ! వెలిగించకుండానే వెలిగే వెండి తీగలూ..' అని మొదలెట్టిన పిల్లలతో 'ఆగండాగండి! అంత తొందరైతే ఎలా? ఆపనిమీదే ఉన్నాగా.. ముందుగా మీకో కథ చెప్పనా?'

ఆదూరి హైమవతి



అని మాధవయ్య అనగానే పిల్లలిద్దరూ 'ఓ... కథంటే మాకెంతో ఇష్టం చెప్పండి తాత గారూ!' అని సరదా పడ్డారు.

'అనగనగా ఒకగ్రామంలో సూర్యం అని మీలాంటి పిల్లవాడు ఉండేవాడు. వాడికి మీలా దీపావళి పండుగంటే మహా సరదా. టపాసులు కాల్చడానికి ఎంతో ఇష్టపడేవాడు వాళ్ళనాన్నను టపాసులు కొనమని మహా గోలపెట్టేవాడు. సూర్యం నాన్న టపాసులకు ధనం వృధాచేయరాదనీ ఆ ధనంతో ఎవరికైనా పేదలకు సాయం చేయాలనీ చెప్పేవాడు, టపాసులు కాల్చేప్పుడు పెద్దవారు దగ్గరుండాలనీ కూడా చెప్పేవాడు, ఎందుకంటే ముఖ్యంగా పల్లెల్లో అన్నీ పూరిళ్ళే ఉండేవి ఆరోజుల్లో. అసలు పండగంటే టపాసులు ఎందుకు కాలుస్తారో మీకు తెలుసా?' ప్రశ్నించాడు మధవయ్య.

'పండగంటే.. పండగే! టపాసులు కాలిస్తే సరదాగా ఉంటుంది. మొన్న ప్రపంచ కప్పు గెలిచినందుకు అందరూ టపాసులు కాల్చడం మేము టివిలో చూశాం. ఎన్నికలు జరిగిన పుడు గెలిచిన వారు టపాసులు కాల్చడమూ టి.వి.లో చూశాం. సంతోషం కలిగితే టపాసులు కాల్చరా ఏం?' అన్నారు చేతన, చిన్మయ.

'మరి దీపావళికి ఎందుకు టపాసులు కాలుస్తారో తెలుసా?'

'అదేమో అందరూ కాలుస్తారు గనుక మేమూ కాల్చాలని అనుకుంటున్నాం. ఇప్పటి దాకా మానాన్న ఎప్పుడూ టపాసులు కొననే లేదు. ఎంతసేపూ అమ్మ టి.వి.లో చూపడం తప్ప. మా నేస్తగాళ్ళంతా 'మేము వెయ్యి రూపాయలకు కాల్చాం,' అంటే మరొకరు 'మేము మూడువేలకు కాల్చాం' అంటారు.

'సరే! అసలు టపాసులు ఎందుకు కాల్చాలో ముందు తెల్సుకోండి, పూర్వం నరకాసురుడనే రాక్షసుడు, దేవుని ప్రార్థించి, తల్లి చేతులోతప్ప చావులేని వరాలుపొంది, ఆ వర గర్వంతో విఱ్ఱవీగి అందరినీ బాధించే వాడు, అంతా వెళ్ళి విష్ణుమూర్తిని అర్థించగా, ఆయన వారికి అభయం ఇచ్చి కృష్ణునిగా సత్యభామతో కలసి వెళ్ళి ఆ నరకాసురుని సత్యభామచేత వధింపచేస్తాడు. ఎందుకంటే ఆమె భూదేవి అవతారం, నరకాసురుని తల్లి భూదేవి, అది అతడికి తెలీదు. ప్రజలంతా అప్పటివరకూ ఆ నరకాసురుని భయంతో ఇళ్ళలో దీపాలు సైతం పెట్టుకోక చీకటి ఇళ్ళలో ఉండేవారట, నరకాసురుని మరణం తర్వాత ప్రజలంతా ఆనందంగా ఇళ్ళలోనూ,

ఇళ్ళముందు దీపాలు వెలిగించుకుని టపాసులు, మతాబులు కాల్చుకున్నారుట.

ఐతే ఈ టపాసుల వలన వీలైనంత వరకూ వాతావరణం దెబ్బ తినకుండా చూడటం మనకర్తవ్యం. మీకింకో విషయం తెలుసా? వేపనూనెకు ఆముదం, ఆవనూనె కలిపి వత్తి వేసి దీపాలు వెలిగిస్తే అసలు దోమలే రావు మరి. ఇంకా ఎండువేపాకు, ఆవాలు, ఆవ ఆకులు కలిపి మంటవేస్తే ఆ పొగకు దోమలు పారిపోతాయి.'

'బావుంది తాతగారూ! మాకు తెలీనివి ఎన్నో చెప్పారు. మరైతే మానాన్న ఎందుకని టపాసులు, మతాబులు కొనడానికి ఇష్టపడటం లేదో మీరు చెప్పనే లేదు.'

'ఇదిగో అక్కడికే వస్తున్నా.. ఇందాకసూర్యం గురించిన కథ మొదలెట్టానా, ఓమారేమైందంటే వాడు వాళ్ళ నాన్నకు తెలీకుండా స్నేహితుడు వాసు ఇంట్లో మతాబులు చుట్టడానికి బొగ్గుపొడి, సురేకారం, గంధకం ఇంకా కొన్ని రసాయనాలు తెచ్చి రహస్యంగా పని మొదలెట్టారు. అవి చుట్టడానికి కాయితం అవసరమై, మరునాటికి ఆపని వాయిదా వేసుకుని అవన్నీ దాచి వచ్చారు.

ఆరోజు రాత్రి సూర్యం పక్కింటి వారు పట్నం నుండీ తెచ్చిన అవ్వాయి చువ్వాయిలు కాలుస్తున్నపుడు ఒకటి వెళ్ళి పక్కనున్న వాడి స్నేహితుడు వాసు ఇంటిమీద పడటంతో, ఆ ఇంట్లో వీళ్ళు దాచి ఉంచిన రసాయనాలు ఉండటం, అది పూరి ఇల్లు కావడంతో అంటుకుని కళ్ళులేని డెబ్బై ఏళ్ళ వాసు తాత బయటికి రాలేక చనిపోయాడు.



అప్పటి నుండీ సూర్యానికి టపాసులు కాల్చే దీపావళి అంటే భయం, అంతేకాక తమ తెలివి తక్కువ పని వలన వాసు తాత మరణించాడనే పాపభీతితో బాధ పడుతుంటాడు. వాసు సైతం ఆనాటి నుండీ సూర్యంలా ఈ టపాసుల పండుగను మానేశాడు. ఆ ఇద్దరికి మాత్రమే తాము చేసినపని తెలుసు. పెద్దలకు తెలీకుండా చేయటం ఎంత ప్రమాదమో అర్థమై ఆనాటినుండీ అల్లరి చిల్లరి తనం మానేసి చక్కగా చదువుకోసాగారు.

తర్వాత కొన్నాళ్ళకు వాసు మనస్సులో దాచుకోలేక తన తండ్రితో చెప్పి ఏడ్చాడు. వాసు తండ్రి అతడిని క్షమించాడు, నిజం చెప్పినందుకు. ఆపై వారిద్దరూ ఎప్పుడూ దీపావళి మతాబులు కాల్చనేలేదు. ఆ వాసే మీ నాన్న వాసుదేవరావని మీరీపాటికి గ్రహించారనుకుంటాను.. మీకిపుడు మతాబుల

వలన జరిగే ప్రమాదం అర్థమైందనుకుంటాను' అన్నారు మాధవయ్య.

ఇలా వారు మాట్లాడుతుండగా కారు ఒక మురికి కాలువవద్దకు రాగానే 'గోపీ! కారు ఆపు' అని మాధవయ్య కారుదిగి, పిల్లలిద్దరినీ దింపి, ఒక చెట్టు కిందకు చేరి 'నరసింహం! నారాయణా! రండి, వారందరినీ తీసుకు రండి!' అని కేకవేయగానే 60ఏళ్ళ నరసింహం 'వస్తున్నానయ్యా' అంటూ 30 మంది పిల్లలను తీసుకుని వచ్చాడు.

పిల్లలిద్దరూ వారిని పరికించి చూశారు. నిక్కర్లున్న వారికి చొక్కాలు లేవు, చొక్కాలున్న వారికి నిక్కర్లు లేవు. ఆడపిల్లలు సైతం చిరిగిన గౌన్లతో చింపిరి జుట్టుతో విచారంగా ఉన్నారు. వారినిచూసి, పిల్లలిద్దరూ తమ బట్టల వంక చూసుకుని ముఖాముఖాలు చూసుకున్నారు.

ప్రతి పండుక్కీ తమ స్నేహితులతో పోల్చుకుని ఇంకా ఖరీదైన బట్టలు కొన్లేదని అమ్మతో జగడమాడటం గుర్తువచ్చి వారికి సిగ్గేసింది. మాధవయ్య కారులోని సంచీలన్నీ గోపీ దింపగా, వాటిలోంచీ కొత్తచొక్కాలూ, నిక్కర్లూ గౌన్లూ, పరికిణీలూ, తీసి పిల్లలచేత వారందరికీ ఇప్పించాడు. అవన్నీ వారు ధరించాక, అందరికీ తలనూనెలు రాయించి దువ్వించి వారిని వరుసల్లో నిలిపి చాలా ఫొటోలు తీశారు.

అందరికీ మిఠాయిలూ, పండ్లూ పంచగా అవి తింటున్న వారి వెలిగే ముఖాలు చూపి, 'ఇవిగో వెలిగించకనే వెలిగే వెండితీగలూ, మండించకనే మండే మతాబులూ, కాల్చకుండానే కాలే కాకరపువ్వొత్తులూ, పూలు చిమ్మే చిచ్చుబుడ్లూ చూస్తున్నారా? మీకు నచ్చాయా?' అని అడిగారు.

పిల్లలు తాత చేతులు పట్టుకుని 'తాతగారూ! ఇహ మేమెప్పుడూ ప్రతి పండుక్కీ కొత్త బట్టలూ, దీపావళికి మతాబులూ అడగనే అడగం, అమ్మానాన్నలను ఇబ్బంది పెట్టం, ఆ డబ్బంతా మా'కిడ్డీ' బ్యాంకుల్లో దాచి ఇక్కడి ఈ మతాబులూ, కాకరపువ్వొత్తులే చూస్తాం సరేనా! చాలా కృతజ్ఞతలు తాతగారూ! మాకు మంచి మతాబులు చూపినందుకు' అన్నారు ఆనందంగా.





# పంచతంత్ర కథలు

నాగకుమారుడి కథ

రాజగృహం అనే నగరంలో దేవశర్మ అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. బిడ్డలు లేరని ఆయన భార్య, ఇతరుల పిల్లలను చూసి నప్పుడల్లా, గుండెలు పగిలేటట్టు ఏడ్చేది. బ్రాహ్మణుడికి భార్య అంటే చాలా ప్రేమ.

ఒకనాడు ఆయన ఆమెతో, 'ప్రేయసీ, నువ్వింక ఏడవటం మాను, నేను పుత్ర కామేష్టి చేస్తాను. అప్పుడు ఎవరో దేవుడు ప్రత్యక్షమై, శ్రవణానందంగా, ఓయీ, బ్రాహ్మణా, సౌందర్యంలో అందరినీ మించగలవాడూ, దీర్ఘాయువూ, ఎడతెగని అదృష్టం గలవాడూ అయిన కొడుకు నీకు కలుగుతాడు, అంటాడు,' అన్నాడు.

ఈ మాట విని బ్రాహ్మణుడి భార్య పర మానంద భరితురాలై, 'తథాస్తు,' అన్నది.

బ్రాహ్మణుడు యధావిధిగా పుత్ర కామేష్టి చేశాడు. ఆయన భార్య గర్భవతి అయింది. ఆమె ప్రసవించి, కొడుకును కనటానికి మారుగా ఒక పామును కన్నది. ఆ పామును చూడగానే, పురుడు పోసిన అమ్మలక్కలు, 'ఛీ, ఛీ, అవతల పారె య్యండి,' అన్నారు.

కాని, ఆ ఇల్లాలు కడుపు తీపి కొద్దీ అంతపని చెయ్యక, ఆ పామును ఆప్యా యంగా దగ్గిరికి తీసుకుని, శ్రద్ధగా నీళ్ల పోసి, ఒక శుద్ధమైన కొత్త కుండలో ఉంచి దానికి పాలూ, వెన్నా పెడుతూ వచ్చింది. పుష్టికరమైన ఈ ఆహారంతో పాము విపరీ తంగా పెరిగింది.

కొద్ది సంవత్సరాలు గడిచాక, పొరు గింటివారి అబ్బాయికి పెళ్లి జరిగింది. ఇది

మిత్రభేదం-**23**



చూసి బ్రాహ్మణుడితో ఆయన భార్య, 'మీకు నా చింత ఏమీ లేనే లేదు. మనవాడి పెళ్లిమాటైనా ఆలోచించారు కారు.' అని కళ్లు ఒత్తుకున్నది.

దానికి బ్రాహ్మణుడు, 'ప్రేయసీ, పాముకు ఎవరు పిల్లనిస్తారు? పాతాళానికి పోయి నాగకన్యకు ఇయ్యమని వాసుకిని ప్రార్థించవలసిందే గాని,' అన్నాడు.

ఈ మాటకు భార్య హృదయవిదారంగా ఏడ్చేసరికి, ఆ బ్రాహ్మణుడు భార్య పట్ల గల ప్రేమ కొద్దీ, తమ నాగకుమారుడికి వధువును వెతుకుతూ ప్రయాణమయ్యాడు.

చాలా నెలల అనంతరం ఆయన చాలా దూరాన ఉన్న కుట్కుటం అనే నగరం చేరుకుని, అక్కడ ఉండే తన మిత్రుడూ, బంధువూ అయిన ఒకసంపన్నుడి ఇంటికి వెళ్లాడు. ఆయన స్నానం చేసి, భోజనం చేసి, ఆ రాత్రి అక్కడే నిద్రపోయాడు. మర్నాడు ఉదయం ఆయన తిరిగి ప్రయాణమవుతుండగా ఆయన మిత్రుడు, 'ఇక్కడికి ఏం పనిమీద వచ్చావు? ఎక్కడికి బయలు దేరుతున్నావు?' అని అడిగాడు.

'నా కొడుక్కు వధువు కోసం చూస్తూ వచ్చాను,' అన్నాడు బ్రాహ్మణుడు.

'అలా అయితే నా అందాల కూతుర్ని నీ కోడలిగా చేసుకో. నువ్వూ నేనూ, ఒకే స్థితి గల వాళ్లం. ఒకే కులం వాళ్లం. ఎరిగిన వాళ్లం,' అన్నాడు మిత్రుడు.

బ్రాహ్మణుడు ఇందుకు సంతోషంగా ఒప్పుకుని, వధువునూ, ఆమె తాలూకు దాసదాసీలనూ వెంట తీసుకుని రాజ గృహానికి తిరిగి వచ్చాడు.

పెళ్లి కూతురి అసాధారణ అందచందాలు చూసి, ఆమెను పాముకిచ్చి పెళ్లి చేస్తున్నారని విని జనం తండోపతండాలుగా పోగయారు. ఆ పిల్లను చూడగానే వాళ్లకు జాలి కలిగింది.

వాళ్ళామె పరివారంతో, 'ధర్మం ప్రకారం నడుచుకునే సజ్జనులమని చెప్పుకునే వాళ్లు ఎక్కడున్నా రత్నంలాంటి, ఈ పిల్లను వెధవ పాముకు ఇచ్చి పెళ్లి చెయ్యటం కద్దా?' అన్నారు.

దాసదాసీలు ఈ దారుణ వార్తను వెంటనే వధువుకు చెప్పారు. చుట్టూ మూగిన జనం ఆ పిల్లను గురించి బాధపడ్డారు. వారిలో పెద్దలు, 'ఈ పిల్లను బలాత్కారంగా విడిపించి, తన ఇంట కూడా స్వేచ్ఛగా తిరగలేని ఆ దిక్కుమాలిన పాముకి భార్య కాకుండా చూడండి' అని అరిచారు.

అంతా విని ఆమె, 'ఇంక చాలించండి! రాజులు తాము జారీ చేసిన ఆజ్ఞలను ఉపసంహరించుకోరని, మంచి వాళ్లు తాము చేసిన వాగ్దానాలను వెనక్కు తీసుకోరనీ, కన్యను దానం చెయ్యడమనేది ఒక్కసారే జరుగుతుందనీ పెద్దలు చెబుతారు. దైవనిర్ణయం జరిగి తీరుతుంది. పుష్పకం చావును దేవతలే నివారించలేకపోయారు,' అన్నది.

'ఏమిటా పుష్పకం కథ?' అని చుట్టూ మూగిన వాళ్లు అడిగారు.

ఆ వధువు వారికి ఆ కథ ఇలా చెప్పింది.

పుష్పకం కథ

ఇంద్రుడి వద్ద అనేక శాస్త్రాలలో ప్రావీణ్యం గల ఒక చిలుక ఉండేది. దాని పేరు పుష్పకం. ఒకసారి అది ఇంద్రుడి చేతిలో కూర్చుని కబుర్లాడుతూ, యముణ్ణి చూసి పారిపోయింది. ఎందుకలా చేశావని దేవతలు పుష్పకాన్ని అడిగారు. 'అన్ని ప్రాణులకూ హాని కలిగించే వాణ్ణి చూసి పారిపోక ఏం చెయ్యను,' అన్నది పుష్పకం.

అప్పుడు దేవతలు యముడితో, 'పుష్పకాన్ని చంపకు,' అన్నారు.

'నేను కాలుడి బంటును. నా చేతిలో ఏమీ లేదు. మీరు వెళ్లి కాలుణ్ణి అడగండి,' అన్నాడు యముడు.

కాలుణ్ణి అడిగితే, మృత్యువును అడగమన్నాడు. దేవతలు మృత్యువును అడిగారు. కాని మృత్యువును చూడగానే పుష్పకం ప్రాణాలు వదిలింది.

(ఇంకా వుంది)





# స్వార్థజీవి

వర్షాలు కురవక కరువు ఏర్పడ్డంతో రాజ్యంలో పరిపాలన గాడిలో పెట్టడానికి సర్వశక్తులు ఒడ్డసాగాడు రాజు విక్రమకేతుడు. తాత్కాలిక నివారణోపాయాలతో ప్రజలకు సాయం అందిస్తున్నా ప్రజల్లో అసంతృప్తి ఇంకా మిగిలే ఉంది.

రోజులు గడుస్తున్న కొలది ఖజానా ఖాళీ అవ్వసాగింది. ఇప్పుడు రాజ్యంపైకి కొత్త సమస్య వచ్చి పడింది. రాజ్య పొలిమేరల్లో ఉన్న అడవుల్లో క్రూరమృగాలు విచ్చలవిడిగా తిరుగుతూ ప్రజల్ని భయభ్రాంతులకు గురిచేస్తున్నాయి.

అటవీ సంపద వినియోగించుకునే ప్రజలు అడవుల వైపు పోవడానికే భయపడుతున్నారు.

ప్రజల విజ్ఞప్తి మేర క్రూరమృగాల సంహారానికి ప్రత్యేక దళాలు నియమించాలనుకున్నాడు రాజు. నిధుల లేమి వెక్కిరించడంతో ఆ పని చేయలేకపోయాడు.

పొదుపు చర్యలలో భాగంగా తనే వేటకు వెళ్లాలని నిర్ణయించుకుని మంత్రితో సంప్రదించాడు.

'ప్రభూ రాజ్య ఆర్థిక పరిస్థితి ఆందోళనకరంగా ఉందని మీ ప్రాణాలను పణంగా పెట్టడం శ్రేయస్కరం కాదు. ఈ సమస్యకు పరిష్కారమార్గం ఇంకేదైనా ఆలోచిస్తే బాగుంటుంది,' అన్నాడు మంత్రి.

'ప్రజల కష్టాలలో స్పందించని పాలకుడు క్రూరుడితో సమానం. అటువంటి రాజు బతికి ఉన్నా లేనట్టే. నిరంతర ప్రజాసేవకుడు ప్రభువు. ఒక మంచి ప్రభువుగా ప్రజల ఆదరణ పొందడమే నా జీవితాశయం' అంటూ వేటకు బయలు దేరాడు విక్రమకేతుడు.

బి.వి. పట్నాయక్

‘ప్రభువును బట్టే మంత్రి’ అంటూ విక్రమకేతుణ్ణి అనుసరించాడు మంత్రి.

ఇద్దరూ అడవిలో కొంతదూరం ప్రయాణించాక పొదల చాటున పొంచివున్న పులి కనిపించింది. అది బాగా బలిసి ఉంది. అది తమపై దాడిచేసేలోపు అప్రమత్తమై బాణాన్ని సంధించాడు విక్రమకేతుడు.

పులికి తగిలిన బాణం నేలపై పడింది. ఆశ్చర్యపోయి దగ్గరకు వెళ్లి చూశారు. అది ఒక శిల్పం. ఇంకొంచెం ముందుకు వెళ్లారు. ఒక సింహం లేడిని నోట కరచుకుని నిలబడి ఉంది. తమతో పాటు తీసుకువచ్చిన గుర్రాలు ఆ సింహాన్ని చూసి విదిలించుకు పారిపోయాయి. రాజు బాణాన్ని గురి చూసి సంధించబోయాడు.

‘ప్రభూ! ఇదీ శిల్పమే!’ అన్నాడు మంత్రి. ముందుకు వెళుతున్న కొలది జీవం ఉట్టిపడిన క్రూరమృగాల శిల్పసంపద అక్కడక్కడ కనిపించింది. ప్రజల్ని భయభ్రాంతుల్ని చేయడానికి శత్రురాజులు పన్నిన పన్నాగమని మంత్రికి అనుమానం వచ్చింది. కాలినడకన కొద్ది దూరం నడిచాక ఆ ఇద్దరికీ ఒక చోట ఒక వ్యక్తి శిల్పానికి రంగులు అద్దుతూ కనిపించాడు.

ఇంతవరకు చూసిన శిల్పాలకు ఈ వ్యక్తికి సంబంధం ఉందని గ్రహించి ‘ఎవరు నువ్వు?’ అని గద్దించి అడిగాడు మంత్రి.

ఎదురుగా రాజూ, మంత్రీ కనిపించడంతో రంగులు అద్దుతున్న వ్యక్తి గౌరవంకొద్దీ నిలబడ్డాడు.




‘నేను మీ రాజ్య పౌరుడిని. శిల్పాలను చెక్కి రంగులు అద్దడం నా వృత్తి,’ అని సమాధానమిచ్చాడు శిల్పి.

‘శత్రు రాజులతో చేతులు కలిపి ఈ పనిచేస్తున్నావా?’ కోపంతో ప్రశ్నించాడు మంత్రి. ‘మాతృభూమిపై మమకారంలో ఈ పని చేస్తున్నాను. శత్రురాజులతో నాకు సంబంధం లేదు. కళను ప్రదర్శించడంలో నా దేశప్రతిష్టను నిలబెట్టాను,’ గర్వంగా చెప్పుకున్నాడు శిల్పి.

‘నీ చేతిలో ముస్తాబైన సజీవ శిల్పాలను చూసి అభినందించక తప్పదు. కాని అదే సమయంలో నీవు దేశద్రోహానికి పాల్పడుతున్నావు. ఈ సజీవ శిల్పసంపదను చూసి భయకంపితులైన ప్రజలు అడవివైపు రావటం మానుకున్నారు. ప్రజల్ని భయ

కంపితుల్ని చేయడం నేరమే గదా!' అని అడిగాడు విక్రమకేతుడు.

'తెలుసు ప్రభూ, ప్రజల్ని భయపెట్టాలనే ఈ శిల్పసంపద సృష్టించాను,' సమాధానమిచ్చాడు శిల్పి.

'ఎంత ధైర్యం? ఏమి ఆశించి ఈ పని చేస్తున్నావు?' అంటూ ఒరలో కత్తి తీయబోయాడు మంత్రి. 'శాంతించండి. కరువు బారిన పడిన రాజ్యాన్ని సుభిక్షంగా ఉంచడానికే ఈ ప్రయత్నం,' అన్నాడు శిల్పి.

'ఎలా?' అర్థం కాక అడిగాడు విక్రమకేతుడు. 'రాజ్యంలో వర్షాలు కురవకపోవడానికి కారణం అంతరించిపోతున్న అడవులని తెలుసుకున్నాను. ఒకప్పుడు అడవుల్లో క్రూరమృగాలు ఉండటం వలన అడవుల్ని నరకడానికి సాహసించేవారు కాదు ప్రజలు. ఇప్పుడు అడవుల్ని నరికి క్రూరమృగాల్ని సంహరిస్తున్నారు. క్రూరమృగాలు లేని అడవులంటే ప్రతి ఒక్కరికీ అలుసే! నరికివేస్తున్న అడవుల్ని రక్షించకపోతే భావితరాలను చేజేతులారా భక్షించినవాళ్లమౌతాం. నా వంతుసాయం చేద్దామనే ఈ శిల్పసంపదను సృష్టించాను. ఇవి నిజమైన జంతువలేనన్న భ్రాంతిలో ప్రజలు ఉన్నారు. అందుకే అడవి సమీపానికి రావడానికే భయపడుతున్నారు. ప్రజల తాకిడి తగ్గితే చెట్టు చేమ పెరిగి అడవులు వృద్ధి చెందుతాయి,' అన్నాడు శిల్పి.

భావితరాల గురించి పరితపిస్తున్న శిల్పి దేశభక్తిని అభినందించాడు రాజు. 'నీకేమి కావాలో కోరుకో?' అన్నాడు.

'ఈ రహస్యం కొన్నాళ్లపాటు ప్రజలకు తెలియకుండా మన ముగ్గురిమధ్యే ఉండిపోయే వరాన్ని ప్రసాదించండి' అన్నాడు శిల్పి.

'ప్రజా సంక్షేమమే స్వార్థంగా బతికే దేశభక్తుడివి నువ్వు. ఇప్పటి నీ శ్రమకు ఫలితం భవిష్యత్తులో కురవబోయే వర్షాలన్నమాట.' అంటూ శిల్పిని ఆలింగనం చేసుకున్నాడు విక్రమకేతుడు.






# దొడ్డమనిషి!

'హాయ్ ఆనంద్ ఎలా ఉన్నావు?' ఆనంద్ తనను పిలుస్తున్నది ఎవరా అని వెనుదిరిగి చూశాడు.

'ఓ.. ఎంత సుదినం.. అరవింద్ నువ్వా? కుశలమేనా?' అంటూ స్నేహితుడిని ఆప్యాయంగా పలకరించాడు ఆనంద్. తాము న్నది గుడిలో అని మరిచిపోయి మిత్రులిద్దరూ కౌగిలించుకున్నారు.

వీళ్లిద్దరూ పదవ తరగతివరకు ఒకే పాఠశాలలో చదివారు. తర్వాత ఆనంద్ పైచదువుల కోసం సమీపంలోని నగరానికి వెళ్లాడు. తర్వాత అతడు ఇంజనీర్ అయి, ఒక పెద్ద సంస్థలో మంచి ఉద్యోగం సంపాదించాడు.

అరవింద్ ఇంజనీరింగ్‌లో డిప్లొమా పూర్తి చేసిన తర్వాత స్వంత పట్టణంలోనే చిన్న దుస్తుల కర్మాగారం పెట్టాడు. చుట్టుపట్ల గ్రామాల్లోని పేద మహిళలను ఉద్యోగాల్లోకి తీసుకుని నిజాయితీగా వ్యాపారం నిర్వహించేవాడు. మిత్రులిద్దరికీ పెళ్లిళ్లు జరిగి, పిల్లలు పుట్టారు. అయితే ఎవరు ఏ పని చేస్తున్నారన్నది వీరిద్దరికీ తెలియకుండా పోయింది. చాలా కాలం తర్వాత కాకతాళీయంగా వీరిద్దరూ ఆలయంలో కలుసుకోవటం తటస్థించింది.

పరస్పరం మాటలాడుకుంటుండగా ఆనంద్ తన జీవిత శైలిని మిత్రుడి జీవన శైలితో పోల్చుకోకుండా ఉండలేకపోయాడు. అరవింద్ పట్టణంలోని తన పాత ఇంటిలోనే కుటుంబంతో ఉంటున్నాడు. అరవింద్ సాదా జీవన శైలితో, తను బతుకుతున్న తీరును పోల్చుకున్నాడు ఆనంద్.

విలాసవంతమైన నివాస భవనం, కారు, కులీనురాలైన భార్య, కాన్వెంటుకు వెళు

డి.జానకి

తున్న కుమారుడు. పోల్చుకోవడానికి కూడా వీల్లేనంత సంపన్న జీవితం తనది.

తర్వాత అరవింద్ మిత్రుడిని తన దుస్తుల కర్మాగారానికి తీసుకెళ్లాడు. అక్కడికి వెళ్లగానే ఆనంద్‌కి చిరాకేసింది. పాత యంత్రాలు, నిరక్షరాస్యులైన కార్మికులు, ఇరుగ్గా ఉన్న కర్మాగారం.. దీన్ని చూడటానికా తను వచ్చింది. అనుకుంటూ ఆనంద్ తన కర్మాగారంలోని కొత్త యంత్రాలను, నూతన సాంకేతిక శక్తిని సరిపోల్చుకున్నాడు. 'ఎంత భాగ్యహీనుడు.. నా ఫ్యాక్టరీకి వచ్చి చూస్తేనా..' అనుకుంటూ తనలో కలిగిన ఏహ్య భావాన్ని ఆనంద్ దాచుకోలేకపోయాడు.

మిత్రుడి మనస్సులో చెలరేగుతున్న భావాలను అరవింద్‌పసిగట్టాడు. "ఆనంద్, అధునాతన కర్మాగారంలో పనిచేస్తున్న నీతో పోలిస్తే, నేను నడుపుతున్న ఈ షెడ్‌ని కర్మాగారంగా పిలవలేను. నా దగ్గర పనిచేస్తున్న వారిని నీ కింద ఉండే నిపుణ కార్మికులతో పోల్చలేను. నావద్ద పనిచేస్తున్న వారు ప్రధానంగా భర్తలను కోల్పోయిన వారు. వికలాంగ మహిళలు, అనాథలు. నిజం చెప్పాలంటే ఈ కర్మాగారాన్ని లాభం కోసం నేను నడపలేదు. నా తండ్రి పదే పదే నాతో చెప్పేవాడు. 'కుటుంబాన్ని పోషించడం అనే స్వార్థ చింతనతో మాత్రమే మనం సంపాదించకూడదు. ఇతరుల కోసం కూడా మనం పాటుపడాలి. నిరాశ్రయులకు, పేదలకు, సహాయ హస్తం అందించాల్సిన విధి మనపై ఉంది. వాళ్లు గౌరవంగా బతికేలా చూడాలి.' మీ సంస్థలో ఉన్నతాధికారిగా పనిచేస్తూ నువ్వు పొందుతున్న దానికంటే అనేక రెట్ల సంతృప్తిని నేను పొందుతున్నాను."

ఆనంద్ తెల్లబోయాడు. అరవింద్ చెప్పింది నిజం. తాను తన భార్యాపిల్లల కోసం బతుకుతుంటే, తన మిత్రుడు ఇతరులు గౌరవంగా జీవించడానికి సహాయం చేస్తున్నాడు. అలాంటి మిత్రుడిని తనకంటే అల్పుడిగా చూడటం ఎంత మూర్ఖత్వం? ఆనంద్ తలదించి గొణుక్కున్నాడు. 'నిజంగానే దొడ్డమనిషి!'





# రాజుగారి కోపం

మంజూష పురాధీశుడు మహేంద్రవర్మకి ముక్కుమీద కోపం. ఒకసారి ఆయన భోజనం చేస్తుండగా పంటి కింద రాయి తగిలిందని కోపోద్రిక్తుడై వంటవాడు గోవిందుడిని పిలిపించాడు. గజగజ వణుకుతూ క్షమించమని వేడుకున్న గోవిందుని కనికరించి వదిలేయక అంత చిన్న తప్పిదానికే అతడి రెండు చేతులూ ఖండించమని రాజు ఆజ్ఞ జారీ చేశాడు.

మరో సందర్భంలో సంగీత కచేరి జరుగుతుండగా గాయకుడు శివానందుని గొంతు కొద్దిగా బొంగురుపోయింది. అంత చిన్న పొరపాటుని కూడా సహించలేక శివానందుని గొంతు కోసి స్వరపేటిక తీసివేయాల్సిందిగా మరో కఠోర ఆజ్ఞని జారీ చేసి అక్కడినుండి వెళ్లిపోయాడు మహేంద్రవర్మ.

కానీ మహేంద్రవర్మకున్న అలవాటు ఏమిటంటే, పట్టరాని ఆవేశంతో అతను ఇలాంటి కఠోర శిక్షలు విధించినా, అవి అమలు జరిగేదీ, లేనిదీ తర్వాత పట్టించుకోడు.

ఒకరోజు మహేంద్రవర్మ నగరవీధుల్లో గుర్రంపై సంచరిస్తుండగా లోగడ తను శిక్షించిన గోవిందుడు, శివానందుడు కన్పించారు. ఆవిటివాడిగా ఉండవలసిన గోవిందుడు చక్కగా తన రెండు చేతులతో కూరగాయలు అమ్ముకుంటున్నాడు. మూగవాడిగా ఉండవలసిన శివానందుడు పిల్లలకు పాఠాలు బోధిస్తూ పాఠశాల నడిపిస్తున్నాడు. వారిని గుర్తించిన మహేంద్రవర్మ అంతఃపురానికి తిరిగివచ్చి తన శిక్షలు సవ్యంగా అమలు జరగనందుకు ఆశ్చర్యపడ్డాడు.

మల్లారెడ్డి మురళీ మోహన్

మహామంత్రిని అందుకు బాధ్యుడిగా భావించి వివరణ కోసం అతణ్ణి పిలిపించాడు.

మహామంత్రిని చూస్తూనే రాజు ఒకింత ఆగ్రహంతో, 'మంత్రివర్యా, లోగడ నేను చేతులు ఖండించమనీ, గొంతు కోసేయమనీ శిక్షించిన వంటవాడు, గాయకుడు ఈ రోజు కనిపించారు. నా ఆజ్ఞని ఉల్లంఘించి వారికి క్షమాబిక్ష పెట్టి విడిచిపెట్టడంలో మీ అంతరార్థం ఏమిటి? నామాటకి ఇక విలువేమున్నట్టు?' అని ప్రశ్నించాడు.

మహేంద్రవర్మ ఆగ్రహానికి కారణం తెలుసుకున్న మంత్రి, 'మహారాజా, అల్పమైన వారి పొరపాట్లకు క్షణికావేశంలో మీరు విధించిన శిక్షలు ఎంతమాత్రమూ సమంజసమైనవి కావు. అంతేకాక, మీ ఆజ్ఞానుసారం మీరు విధించిన శిక్షలు కూడా నేను అమలు జరిపాననే అనుకుంటున్నాను,' అన్నాడు.

విషయం అర్థంకాని మహేంద్రవర్మ, 'వాళ్లిద్దరూ ఏ అవిటితనమూ లేకసక్రమంగానే తిరుగుతున్నప్పుడు నా శిక్షలు అమలు జరిగినట్లు ఎలా అవుతుంది?' అని సందేహాన్ని వెలిబుచ్చాడు.

రాజు కోపం కొద్దిగా తగ్గినట్లు గ్రహించిన మంత్రి, 'మహారాజా, నిజానికి వంటవాణ్ణి, గాయకుణ్ణి మీరు వాళ్ల వృత్తి పరంగా శిక్షించారు. కానీ వ్యక్తిగతంగా వాళ్లపై మీకే మాత్రమూ కోపంలేదు. అందుకే వాళ్లని నేను ఆయా ఉద్యోగస్థానాల నుండి తప్పించి రాజాస్థానం నుండి వెలివేశాను. ఆలా గోవిందుడిలో నిష్ణాతుడైన పాక శాస్త్ర ప్రావీణ్యుడినీ, శివానందుడిలో మెరుగైన కళాకారుణ్ణీ శాశ్వతంగా సమాధి చేసేశాను. ఒక విధంగా మీరు విధించిన శిక్షలనే అహింసాత్మక మార్గంలో నేను అమలు జరిపాను,' అని వివరించాడు. అంగీకార సూచకంగా రాజు తలపంకించాడు.






# కయ్యంలో వియ్యం

సుమారు నాలుగువందల సంవత్సరాల కిందట, మైసూరు ప్రాంతంలో ఒక రాష్ట్రాన్ని పురుషోత్తముడనే రాజు పాలించుతూ ఉండేవాడు. ఆయన గంగవంశానికి చెందినవాడు. గౌరవనీయుడైన ప్రభువు. అవివాహితుడు. తనకు తగిన కన్య దొరికితే తప్ప పెళ్లాడనని పట్టుదల వహించాడు.

ఆకాలంలో, కాంచీపురాన్ని ఏలే కంచి రాజుకు ఒక కుమార్తె ఉండేది. ఆమె లోకైక సుందరి అని పేరు పొందింది. పురుషోత్తముడికి ఈ కన్య అన్ని విధాలా తగినదని లోకంలో ఒక వదంతి బయల్దేరింది. ఈ వార్త పురుషోత్తముడి తండ్రికి చేరగానే, ఆయన కంచిరాజుకు పురోహితుని ద్వారా రాయబారం పంపించాడు. పెళ్లి చూపులకు ఏర్పాటు కూడా జరిగింది. కంచి రాజు వారికి సమస్తమైన మర్యాదలూ జరిపించి, తమకు కావలసిన భోగట్టాలన్నీ తెలుసుకున్నాడు. పురుషోత్తముడు గొప్పవంశానికి చెందిన యువకుడు. మంచి విద్యావంతుడు, శక్తి సామర్థ్యాలు కలవాడు.

అన్నిటికీ మించి ఉన్నతమైన అంతస్థు కలిగిన వాడు. పైగా ఆ సమావేశంలో పురుషోత్తముడూ కంచి రాజు కూతురూ ఒకరినొకరు చూసుకొని మనసులో ఇష్టపడ్డారు.

ఇన్నివిధాల అనుకూలంగా ఉండే పురుషోత్తముని సంబంధం కంచి రాజుకు బాగా వచ్చింది. అందుచేత, ఖాయపరిచి కబురు చేద్దామని అనుకుంటున్నాడు.

ఆర్. జయంతి



పురుషోత్తముడు కూడా ఈ సంబంధం నిశ్చయమైనట్లే భావించి తన రాజ్యానికి వెళ్లిపోయాడు.

అయితే, తీరా పురుషోత్తముడు మరలి పోయిన తరవాత కంచిరాజుకు ఒక చిత్ర మైన సంశయం పట్టుకొన్నది. అది ఏమి టంటే...,

గంగవంశపు రాజులు గొప్ప భక్తులు. తరతరాలుగా వారు జగన్నాథస్వామిని కొలుస్తూ ఉండేవారు. పుణ్యక్షేత్రమైన శ్రీజగన్నాథంలో స్వామికి బ్రహ్మాండమైన ఆలయం నిర్మించింది కూడా వారే.. అనగా గంగవంశ ప్రభువులే. స్వయంగా స్వామి వారికి కైంకర్యాదులు జరిపించడం ఆ రాజులకు వంశాచారమై ఉంటున్నది.

ఇలా వంశపరంపరగా వస్తున్న ఆచా రాన్ని అనుసరించి, ఏడాదికి ఒకసారి లాంఛనప్రాయంగా, పురుషోత్తముడు కూడా జగన్నాథస్వామివారి ఆలయానికి వెళ్లడం ఉత్సవ సమయమందు స్వామికి సేవచేసినట్టు సూచనగా బంగారు కట్టు గల చీపురుతో అట్టే నేల ఊడవటం మామూలు.

ఈ సంగతి తెలిసిన కంచిరాజు మనసు మార్చుకుని, 'ఊడ్చేవాడికా నా కూతు రునిచ్చి పెళ్లి చేయడం? ఇవ్వను గాక ఇవ్వను,' అని ఖచ్చితంగా చెప్పి, పురు షోత్తముడి తండ్రికి కబురు పంపిం చాడు. కంచిరాజు పంపిన కబురు చెవి నపడగానే, పురుషోత్తముడికి చెప్పలేని పౌరుషం వచ్చేసింది. అందులోనూ, ఈ విధంగా తమ ఇలవేలుపయిన స్వామి వారినే దూషించడంతో అతను ఉగ్రుడై, కంచిరాజుకి శాస్తి చేయాలని ప్రతిజ్ఞ పట్టాడు.

పురుషోత్తముడు ఇలా ప్రతిజ్ఞ పట్టిన మరి కొద్ది రోజులలోనే రాజు సేనలు పోయి కంచి రాజ్యాన్ని ముట్టడించినై. అయితే, కంచి రాజు చూడగా సామా న్యుడు కాడు. ఆ యుద్ధంలో గంగ వంశపు సేనలను అవలీలగా తరిమి వేశాడు కంచిరాజు.

ఓడిపోయిన పురుషోత్తముడు నిరాశ చెందలేదు. ఈసారి రెట్టింపు ఉత్సా

హంతో మరింత ఎక్కువగా సైనికబలం సమకూర్చుకుని, ఇంకా ఎక్కువ పట్టు దలతో రెండవసారి యుద్ధానికి వెళ్లాడు. ఎంత సమర్థుడైనప్పటికీ కంచిరాజు, ఈమారు జరిగిన మహాయుద్ధంలో నెగ్గ లేకపోయాడు.

ఎప్పుడైతే కంచిరాజు ఓడిపోయాడో, కసికొద్దీ పురుషోత్తముడు, తనకు శత్రు వైన కంచిరాజునూ, రాజకుమారిని బంధించమని ఆజ్ఞాపించాడు.

ఇప్పుడు తన వశమైఉన్న ఆ రాజ కుమారిని పెళ్లాడటానికి ఎటువంటి అభ్యంతరమూ చేయలేదు గనుక, పురుషోత్తముడు అలా చేస్తాడని అను కొన్నారు అందరూ. కాని, పురుషోత్త ముడు ఆ పిల్లను పెళ్లాడదలచలేదు సరికదా, మళ్లీ కన్నెత్తి ఐనా చూడలేదు. తన మంత్రిని పిలిచి, ఈ అమ్మాయికి ఎవడైనా ఊడ్చేవాడి సంబంధం చూచి ముడిపెట్టవలసిందని ఆజ్ఞ ఇచ్చాడు.

కోపం కొద్దీ రాజు ఇచ్చిన ఆజ్ఞను పాలించటమా వద్దా, అని గట్టిసమస్య పట్టుకొన్నది మంత్రికి. అయితే మంత్రి మంచి బుద్ధికుశలుడు. ఈ విషయంలో ఎంతమాత్రం తొందరపడకూడదు. బాగా నిదానించాలి అనుకొన్నాడు. 'సరే'నని రాజు వద్ద సెలవు తీసుకుని, ఆ క్షణ మందే ఎవ్వరికీ తెలియని ఒక రహస్య స్థలంలో కంచి రాజకుమారికి బస ఏర్ప




రిచి, అక్కడ ఆమెకు సమస్తమైన రాజో పచారాలూ జరగటానికి తగిన ఏర్పాట్లు చేశాడు. ఈ సంగతి బ్రహ్మరుద్రులకైనా తెలియదన్నమాట.

ఆజ్ఞ ఇచ్చిన తరవాత పురుషోత్త ముడు రాజకుమారిని గురించిన సమా చారమే మరిచిపోయాడు. కంచిరాజుకు కూడా క్రమేణా కోపం తగ్గింది. దురుసు తనంగా తను ఆనాడు తూలనాడినం దుకు ఎంతగానో పశ్చాత్తాపం చెందాడు.

తరువాత, మరి కొద్ది నెలలకల్లా మళ్లీ శ్రీజగన్నాథ స్వామివారి ఉత్సవాలు వచ్చినై. మామూలు ప్రకారం పురుషోత్త ముడు స్వామిని సేవించే దీక్షలో నిమ గ్నుడయ్యాడు. బంగారు పిడి గల ఒక

చీపురును ప్రభువు చేతికి అందించాడు పూజారి. పురుషోత్తముడు అత్యంత భక్తితో స్వామివారి పాదాల వద్ద ఊడుస్తు న్నాడు.

ఆ సమయాన మంత్రి వచ్చి ప్రభువు ఎదుట వినయంగా చేతులు కట్టుకు నిలబడ్డాడు. అతని వెంబడే సర్వాలం కార శోభిత అయిన ఒక లోకైక సుందరి పూలమాల చేతపట్టుకుని నిలబడింది.

'మహారాజా! మన్నించాలి. ప్రభు వుల ఆజ్ఞ పాటించవలసిన సమయం నాకిప్పుడు దొరికింది. శ్రీ స్వామివారి పాద ధూళిని ఊడ్చి సేవించేవానినే నేను భర్తగా ఎంచుకున్నాను అని ప్రతిజ్ఞ పట్టి ఉన్నది ఈ రాకుమారి. ఎక్కడ వెదికినా అటు వంటి యోగ్యుడు నాకు కనిపించలేదు. కనుక, ఈ కన్యను మళ్లీ ఏలికకే అప్ప గించుకుంటున్నాను అని చెప్పి వెనక్కు తప్పుకొన్నాడు బుద్ధికుశలుడైన మంత్రి.

అప్పుడు కంచి రాజకుమారి భక్తితో పూలమాలను పురుషోత్తముడి మెడలో వేసింది. అకస్మాత్తుగా గుడిపైనుంచి పువ్వుల వాన కురిసింది. పురుషోత్తము డికి అమితాశ్చర్యం కలిగింది. తలవని తలంపుగా వెనకటి విషయాలు గప్పున గుర్తుకు వచ్చినై.

ఇదంతా స్వామివారి మహిమే కదా అనుకొని, పురుషోత్తముడు ఈ పెళ్లికి తన సమ్మతిని తెలిపాడు. అప్పుడే కంచి రాజు కూడా విముక్తుడై వచ్చాడు. పురు షోత్తముడికీ కంచిరాజు కుమార్తెకూ అత్యంత వైభవంగా వివాహం జరిగింది.

ఈవిధంగా జరిగినందుకు రాజ్యంలో ప్రజలంతా అమితంగా సంతోషించారు. మంత్రి యొక్క బుద్ధికుశలతను ఆబాల గోపాలమూ వేన్నోళ్ల వినుతించారు. ధన్యుణ్ణి అయ్యాను, అనుకొన్నాడు కంచిరాజు.





# వైద్యుని లౌక్యం

ఆనందగిరి పశ్చిమకనుమలలోని ప్రకృతి రమణీయత నిండిన కుగ్రామం. ఆ గ్రామంలోని ప్రజలు ఎక్కువమంది నిరక్ష రాస్యులు, అమాయకులు. కనువిందు చేసే పరిసరాలతోపాటు, అరుదైన వన మూలికలు దొరికే అవకాశముండడంతో. చరకనాథుడు అనే ఆయుర్వేదవైద్యుడు ఆనందగిరిలో స్థిరనివాసం ఏర్పరచుకు న్నాడు.

ఎన్నో క్లిష్టమైన జబ్బులను కూడా అతి సులువుగా తగ్గిస్తూ, త్వరలోనే మంచి వైద్యునిగా పేరు తెచ్చుకున్నాడు. దూర పాంతాల ప్రజలు కూడా వైద్యం కోసం తన వద్దకు వచ్చేవారు. అభిరాముడు అనే యువకుడు వైద్యవిద్యను నేర్చుకోవాలన్న మక్కువతో, చరకనాథుడి వద్ద శిష్యునిగా చేరాడు. మందులతయారీ, రోగులకు చరకనాథుడు సూచించే మందులను గుర్తుంచుకోవడం... అభిరాముడి దిన చర్యగా ఉండేది. అంతేగాక, తన గురువు రోగులతో వ్యవహరించే పద్ధతిని కూడా పరిశీలించేవాడు.

ఓ రోజు ఉదయాన... జమీందారు వేమవర్మ వైద్యశాలకు విచ్చేశాడు. తన ఆరోగ్యసమస్యను చరకనాథుడికి పూర్తిగా వివరించాడు. వేమవర్మకు దీర్ఘకాలంగా చర్మవ్యాధి ఉంది. చాలాకాలంగా అది సాధారణస్థాయిలోనే ఉండడంతో ఆయన దానిపై దృష్టి పెట్టలేదు.

కానీ, ఇటీవల అది శరీరమంతా పాక టంతోపాటు ఇతర ఆరోగ్యసమస్యలను సృష్టించసాగింది. దాంతో... ఇక వైద్యశా లకు రాక తప్పలేదు. చరకనాథుడు అతని చర్మాన్ని పరిశీలించి, పైపూతగా ఒక

శాఖమూరి శ్రీనివాస్



వేమవర్మ. 'గ్రామానికే మకుటం లాంటి మీరు వైద్యశాలకు రావడమే ఆనంద దాయకం. వైద్యరుసుము ఇచ్చి మమ్మల్ని ఋణగ్రస్థుల్ని చేయకండి.' అంటూ ఆ పైకాన్ని సున్నితంగా తిరస్కరించాడు చరక నాథుడు. సంతోషభరితుడైన వేమవర్మ చరకనాథుడి భుజంతట్టి ఇంటికి బయలు దేరాడు.

అదేరోజు సాయంత్రం... సంజీవుడు అనే రైతుకూలి తీవ్రమైన ఉదర వ్యాధితో వైద్యశాలకు వచ్చాడు. బాధతో పొట్ట చేత్తో పట్టుకుని మెలికలు తిరిగిపోతున్నాడు. అతణ్ణి వెంటనే ఓ చెక్కబల్లపై పడుకోబెట్టి పొట్టపై లేపనపుపట్టీ వేశాడు చరకనాథుడు.

ఆకుపసరునిస్తూ.. 'వేమవర్మ గారూ, మీకు ఇంకా కొన్ని మందులు అవసరం. అయితే అవి నా దగ్గర లేవు. అవి తయారు చేసేం దుకు తగిన మూలికలు ఈ ప్రాంతంలో లభించవు. నీలగిరి కొండల్లోని ఉదకమండ లంలో ఉన్న మణికాంతుడనే వైద్యప్రము ఖుడి వద్ద లభిస్తాయి. ఇది సులువుగా తగ్గే వ్యాధి కాదు, సమయం పడుతుంది.' అన్నాడు.

'ఆ మందులు ఎక్కడున్నా తక్షణమే తెప్పిస్తాను. వాటి వివరాలు నాకు వ్రాసి ఇవ్వండి' ఆతృతగా అడిగాడు వేమవర్మ.

చరకనాథుడు మందుల వివరాలను ఒక తాటాకుపై ఘంటంతో వ్రాసి ఇచ్చాడు. దానిని తీసుకుని వెళ్ళబోతూ వైద్యరుసు ముగా కొంత పైకాన్ని తీసి ఇవ్వబోయాడు

అభిరాముడిని పురమాయించి అప్పటి కప్పుడు మహాప్రాణ కషాయం తయారు చేయించి తాపించాడు. కొంచెం సేపటికే నొప్పి తగ్గుముఖం పట్టి సంజీవుడు తేరు కున్నాడు. మరొక గంటకు పూర్తి స్వస్థత చేకూరింది.

'నీ కడుపు నొప్పి పూర్తిగా మాయమైనట్లే, తిరిగి వచ్చేందుకు సాహసించదు మరి. ఎలాంటి ఇబ్బంది కలిగినా మొహమాటప డక ఇక్కడికి వచ్చేయి' నమస్కరిస్తోన్న సంజీవుడిని వారిస్తూ చెప్పాడు చరకనా థుడు.

సంజీవుడు తన జేబులోని స్వల్ప పైకాన్ని తీసి అందించాడు. ఆయన దానిని ఆనందంగా స్వీకరించి సంజీవుణ్ణి సాగనం పాడు. రెండు సంఘటనలు పరస్పరవిరు

ర్థంగా తోచాయి అభిరాముడికి. ధనికునికి ఉచితంగా, బీదవానికి పైకం తీసుకుని వైద్యం చేయడం సమంజసం అనిపించ లేదు. ఎంత ఆలోచించినా గురువుగారి ఆంతర్యమేమిటో బోధపడలేదు. ఆ రాత్రి కలతనిద్ర పోయాడు.

మరుసటిరోజు ఉదయం.. తన సందే హానికి నివృత్తి దొరకకుంటే స్వాంతన లభించదని భావించాడు. నేరుగా చరక నాథుడినే, 'నిన్నటినుంచి నన్నొక సందేహం పీడిస్తూ ఉంది. అడగమంటారా?' అని ప్రశ్నించాడు.

'నిరభ్యంతరంగా.. సందేహమే జ్ఞానా నికి మూలం. శిష్యుని సందేహనివృత్తి గురువు కర్తవ్యం, ప్రశ్నించు', నవ్వుతూ అన్నాడు చరకనాథుడు.

గురువు చెప్పిందంతా విన్న అభిరా ముడు, 'హేమవర్మకు వచ్చిన చర్మవ్యాధి తీవ్రమైనది. దానికి తగిన మందులు మన వద్దలేవు. రుసుము తీసుకుంటే, డబ్బులు తీసుకుని కూడా ఔషధాలివ్వలేదని భావి స్తాడు. పైగా అతను అహంకారి, మనపట్ల ప్రజల్లో దుష్ప్రచారం చేస్తాడు. అందుకే అతని సొమ్మును తిరస్కరించాను'.

'మరి బీదవాడైన సంజీవునివద్ద సొమ్ము తీసుకోవడం సరైనదేనా?'

'సంజీవుడు కష్టజీవి. మనం అతనిదగ్గర పైకం తీసుకోకుంటే చిన్నతనంగా భావి స్తాడు. అతను ఏదీ ఉచితంగా కోరడు. తానేకాదు... ఇక్కడి ప్రజలంతా దాదాపు అలాంటివారే! దాంతో... అతణ్ణి సంతృప్తి పరచేందుకు కాస్త రుసుము తీసుకుని, దానికి ఎన్నోరెట్లు విలువైన ఔషధాలు ఉచి తంగా ఇవ్వడం జరిగింది. మనం ఇక్కడ స్థిరంగా ఉండి ప్రజలను పూర్తి ఆరోగ్యవం తులుగా మార్చాలంటే ఈమాత్రం లౌక్యం తప్పదు.' వివరించాడు చరకనాథుడు.

గురువుగారి లౌక్యానికి అచ్చెరువొందిన అభిరాముదు వైద్యజ్ఞానంతోపాటు చక్కటి వ్యవహారశైలిని అలవర్చుకున్నాడు.





# మహామల్లు

శుంభావతీ నగరాన్ని శంబలుడనే రాజు పరిపాలన చేసేవాడు. ఆయన ఆస్థానంలో గొప్పగొప్ప మల్లులూ, వీరులూ గల పరివారం ఉండేది. ఒకప్పుడు మహామల్లుడనే ఒక గొప్ప వస్తాదు శంబలుని ఆస్థానానికి వేంచేశాడు.

ఆయన దేశదేశాలలో ఎంతోమంది మల్లులను గెలిచి, ఘనమైన బిరుదులూ, పతకాలూ పొందినవాడు, నన్ను ప్రపంచంలో ఎవ్వరూ జయించలేరు, అని చేతికి తోడా వేసుకున్నటువంటి మొనగాడు.

మహామల్లు నేరుగా శంబల మహారాజు వద్దకు వెళ్ళి, 'మీ ఆస్థానంలో నన్ను గెలిచే వాళ్లెవరైనా ఉన్నారా? ఉంటే సరి, లేకపోతే, మీరు ఓడిపోయినట్లు ఒప్పుకుని నాకు బిరుదుపత్రం ఇప్పించండి,' అని సవాలు చేశాడు.

అందరూ తెల్లబోయారు. ఏమి చెప్పనూ రాజుకు తోచింది కాదు. వెంటనే మంత్రి లేచి 'దీనికేమున్నది ప్రభూ! మన ఆస్థానంలో ఉంటూ ఉండే, చండ ప్రచండ దోర్దండ గుండూ మల్లుగారికి ఈ లోకంలో సాటి ఎవరు? వారు ఇప్పుడు ఊరికి వెళ్ళి ఉన్నారు. ఎల్లుండీపాటికి రానే వస్తారు. వస్తూనే ఈ మహామల్లు గారికి బదులు చెప్పనూ చెబుతారు,' అన్నాడు.

వెంటనే మహామల్లుకు సమస్త మర్యాదలతోనూ చక్కటి బస ఏర్పర్చబడింది. మహామల్లు బసలో కూర్చున్నాడే కానీ, మంత్రిమాటలు విన్నప్పటినుంచీ మనస్సు అదొకలాగా మారిపోయింది.

అతడు పరిచారకులను చేరబిలిచి, ఆ గుండూ మల్లు గురించి భోగట్టాలు అడిగాడు ఆత్రంతో. అందుకు పరిచారికులు,

బి. లక్ష్మీనారాయణ

‘ఆయన ఇక్కడి మల్లులకందరికీ గురువు. వారు యోగసాధనలో ఉంటారు. తగినంత పని కలిగి, ఇక ఆస్థానం పేరు పోతుందేమో అనే సమయం వస్తే తప్ప సామాన్యంగా బయటికే రారు,’ అని చెప్పారు.

మరునాడు, మహామల్లు బసకు సమీపంలోనే ఒక ప్రత్యేక భవనం నిర్మించారు. దానికి ఒక బ్రహ్మాండమైన సింహద్వారం అమర్చారు. ఇది చూచి ఆశ్చర్యపడి, ‘ఏమిటి?’ అని అడిగాడు మహామల్లు. అందుకు సేవకులు మా గుండూ మల్లుగారు దయచేస్తారు. వారు సామాన్యులా? మామూలు గుమ్మం సరిపోదు వారికి? అందుకనే ఆ సింహద్వారమూ, ఆ భవనమున్నూ,’ అని బదులు చెప్పారు.

ఇల్లు కట్టే పనివాళ్ళతో మేస్త్రీ, ‘అరేయ్, బాగా గట్టిగా దిమ్మిశ కట్టండి. మన గుండూ మల్లుగారు అడుగులు వేశారంటే నేల దిగబడిపోయి గోతులు పడుతుంది సుమా.’ అంటూ హెచ్చరింపసాగాడు. మల్లు చూస్తూండగానే గంగాళాలతోనూ, బండ్లతోనూ వెన్న, బాదంపప్పులూ, వస్త్రాదులు తినేపదార్థాలూ వచ్చిపడుతున్నాయి. ఈ ఆట్టహాసమంతా పరిశీలనగా కనిపెట్టుతూనే ఉన్నాడు మహామల్లు. ఆ మరునాడు గుండూమల్లుగారు ఈ కొత్త భవనంలో దిగుతారని నగరమంతటా మారుమోగింది.

అన్నట్లుగానే, మరుసటి ఉదయాని కల్లా ఇరవై ఎనిమిది గుర్రాలు లాగేటటువంటి ఒక చిత్రమైన వాహనం వచ్చి భవనం వాకిట నిలిచింది. పరివారమంతా ‘చండ ప్రచండ దోర్దండ గుండూ మల్లుగారికీ జై!’ అంటూ పెద్దగా ఘోష పెట్టారు. మల్లుగారికి స్వాగతమివ్వటానికని మహారాజుగారు స్వయంగా ఆ వాహనం వద్దకు వచ్చారు.

మహామల్లుగారికి, గుండూమల్లుగారిని పరిచయం చేద్దామని మంత్రి ఆయన బసకు వెళ్ళి చూచాడు. ఏమున్నదీ అక్కడ? బస ఖాళీ! బిరుదులు వహించిన ఆ మహామల్లుగారు ఎప్పుడు ఎలా మాయమయ్యారో ఎవళ్ళకూ తెలియనే తెలియదు!!





# గుణమణి

రెండువందల సంవత్సరాలకు పూర్వం మైసూరు ప్రాంతంలో నిజగల్లు అని ఒక చిన్న రాజ్యం ఉండేది. ఆ రాజ్యానికి ప్రభువు రామరస నాయకుడు. ఆయన గొప్ప వీరుడు. మంచి మనస్సు కలవా డున్ను. పట్టపురాణి పేరు లకుమవ్వ.

రాజు సమస్తమైనవైభవాలతోను తుల తూగుతూ ఉండేవాడు. కాని, ఒక్కటే లోపం. పెళ్లి అయి పదేళ్లయినా, సంతతి కలగలేదు. రాజు చేయని పూజలు లేవు. రాణి నోచని నోములు లేవు. ఎంత చేసినా, ఫలితం లేకపోయింది.

లకుమవ్వ మనస్సు చాలా కించ పడింది. ఏమీ? రాజ్యమన్న తరవాత యువరాజు ఉండాలి కద! ఉన్నప్పుడే పరిపాలన సవ్యంగా సాగిపోతుంది. లేకుంటే అంతా అరాచకమే. కనుక, ఆమె తీవ్రమైన ఆలోచనలో పడింది. ఆలోచించగా ఆలోచించగా ఆమెకు ఒక చక్కటి ఉపాయం తట్టింది. వెంటనే ఆమె, తనకు దగ్గర బంధువైన ఒక సుందరికి కబురు పంపి రప్పించి, తనకు సహచారిణిగా పెట్టుకున్నది. ఆమె చక్కని చుక్క, సుగుణాల రాణి. పేరు గిరిజవ్వ.

ఈ గిరిజవ్వను గురించి పట్టపు రాణి లకుమవ్వ భర్తకు ఎంతగానో చెప్పి, ఆమెను పరిణయమాడవలసిందని కోరింది. మొదట, రాజు ఈ సలహాకు ఇష్టపడలేదు కాని, లకుమవ్వ పదే పదే వేడుకోగా, ఎలా అయితేనేం, గిరిజవ్వను రాణిగా చేసుకోవడానికి సమ్మతించాడు.

జి. భాస్కరమ్మ

గిరిజవ్వను రాజు పెళ్లి చేసుకోవడంతో లకుమవ్వ సంకల్పం చాలావరకు నెరవేరింది. అయితే గిరిజవ్వకు పెళ్లి కావడంతోనే ఆమె తల్లి, లేనిపోని పెత్తనం కల్పించుకోసాగింది. 'లకుమవ్వ మాట చెల్లనీయకు. నీపైనే రాజుకు ఎక్కువ ఇష్టం కనుక, ఆమెపైన అధికారం చెలాయించి, నీపంతం నెగ్గించుకుంటూ ఉండు,' అంటూ దుర్బోధలు చేస్తూ వచ్చింది.

తల్లి ఎంత నూరిపోసినా, ఉత్తమురాలైన గిరిజవ్వలో ఏమీ మార్పు రాలేదు. ఆమె, తనను చేరదీసి రాణిగా చేసినందుకు పట్టపురాణి పట్ల కృతజ్ఞత చూపిందే కాని అక్కను తృణీకరించటానికి ఎంత మాత్రమూ ఒప్పుకోలేదు. అది ఆమె తల్లికి కష్టమే అనిపించింది.

ఏమైతేనేం, అదృష్టం పండి, రెండేళ్లకల్లా గిరిజవ్వకు ఒక మగశిశువు కలిగాడు. రాజూ, రాజ్యంలోని ప్రజా, అందరికంటే ముఖ్యంగా లకుమవ్వా, చెప్పలేని సంతోషం పొందారు. ఉత్సవాలు చేశారు.

ఇదిలా ఉండగా--

గిరిజవ్వకు కస్తూరి నాయకుడు అని ఒక తమ్ముడున్నాడు. వాడొక దుష్టుడు. పైగా, పరమమూర్ఖుడు. వాడికి చెడ్డ వాళ్లతో స్నేహం. గిరిజకు ఎప్పుడైతే పెళ్లి అయిందో, నాటినుంచి వాడూ కోటలోనే




ఉంటూ వచ్చాడు. అందుకు తోడు, రాణిగారి తమ్ముడైనందుకు ఆస్థానంలో మంచి పదవి, అధికారం కూడా లభించినై.

అయితే, ఒకనాడు అకస్మాత్తుగా శత్రుసైనికులు కోటలోకి వచ్చేశారు. దీనికి కారకుడెవడు? కస్తూరి నాయకుడే. వాడు శత్రువులతో కూడి, వాళ్ల సాయంతో బావమరిదిని తొలగించి, నిజ గల్లు సింహాసనం తనే ఆక్రమించాలని ఆశించాడు. మనసు లోపల ఈ ఆశ పెట్టుకొని, పైకి మాత్రం బావమరిదితో ఎంతో ఇష్టాగోష్టిగా నమ్మకంగా ఉంటున్నాడు. కస్తూరి నాయకుని నమ్మి, వానిని రాజ్యానికి సేనానాయకునిగా నియమించాడు రాజు.




సేనాని పదవి రావడంతో కస్తూరి నాయకునికి పరిస్థితులు మరీ అనుకూలంగా అమరిపోయినై. శత్రువర్గానికి చెందిన పొరుగురాజులతో కుట్రచేసి, కస్తూరి నాయకుడు 'ఫలానా రోజున రాత్రివేళ దాడి వెడలి రండి. నేను కోట ద్వారాలు తెరిచి ఉంచే ఏర్పాటు చేస్తాను' అని చెప్పాడు.

కస్తూరి నాయకుడు చెప్పినట్లుగానే, రాత్రి సమయాన శత్రు దళాధిపతి సులువుగా కోటలో చొరబడ్డాడు. కపటియైన కస్తూరి నాయకుడు శత్రువులతో యుద్ధం చేస్తున్నట్లు నటించాడు. కాని త్వరలోనే వాడు చేసిన కుట్ర వెల్లడైపోయింది. పాపం, ఆ యుద్ధంలో రామరస నాయకుడు వీరమరణం పొందాడు. నిజగల్లు రాజ్యం శత్రువుల వశమయిపోయింది. కస్తూరి నాయకుడు తనను నిజగల్లు రాజుగా చేయమని శత్రురాజును కోరబోయాడు. ఐతే ఇప్పుడు గిరిజవ్వ అద్భుత సౌందర్యం చూసిన ఆ దళాధిపతి ఒక కొత్త షరతు పెట్టాడు. 'గిరిజవ్వ నన్ను పెళ్లాడితే, ఆమెకు పుట్టే బిడ్డను రాజుగా చేసి నిన్ను ప్రతినిధిగా చేస్తాను అని. లేకుంటే నీకూ లేదు, ఆమెకూ లేదు', అని బెదిరించాడు కూడాను.

చేసేదిలేక, అప్పటికి సరే అని తల ఊపాడు కస్తూరి నాయకుడు. పోయి గిరిజవ్వ ఉద్దేశం తెలుసుకుందామని ఇద్దరూ కలిసి, ఆమె వద్దకు వెళ్లారు. దళాధిపతి తన ఉద్దేశం ఆమెకు చెప్పి, జవాబు కోరాడు. 'మా తమ్ముడు ఒప్పుకుంటే నాకు అభ్యంతరం లేదు.' అన్నదామె.

ఏమీ సంశయించకుండా వెంటనే కస్తూరి నాయకుడు 'నాకు సమ్మతమే సమ్మతించక విధిలేదు,' అన్నాడు.

అప్పుడామె ఒకే ఒక కోరిక కోరుకున్నది. 'మా కులాచారం ప్రకారం, పెళ్లికి ముందు నేనూ, నా తమ్ముడూ ఊరేగింపు చేసి రావాలి,' అన్నది. ఈ వింత కోరికకు అక్కడి అందరూ ఆశ్చర్యపోయారు. దళపతి సరేనన్నాడు. ఊరేగింపు జరగడానికి తగిన ఏర్పాట్లు చేశారు.

ఈ సంగతి అంతా తెలిసిన లకుమవ్వ వచ్చి, 'దళాధిపతిని పెళ్లాడవద్దు సుమా,' అని హితవు చెప్పబోయింది. కాని, గిరిజవ్వ చెవిని పెట్టలేదు. అలా మాట మన్నించక పోవడం అక్కయందు భక్తి లేక కాదు, ఒక గొప్ప ఉద్దేశం నెరవేర్చేటందుకే. ఊరేగింపు సమయాన గిరిజవ్వ తన బిడ్డను అక్కగారయిన లకుమవ్వకు అప్పగింత పెట్టి, 'అక్కా! ఈ బిడ్డ నీది..!' అంటూ ఆఖరు మాటలు చెప్పి, తన మానాన తను వెళ్లింది.

గిరిజవ్వ కోరిక ప్రకారం గొప్ప ఊరేగింపు సాగింది.. ఒక పక్క నుంచి కస్తూరి నాయకునిది, మరో పక్క నుంచి గిరిజవ్వది. కట్ట కడపట, నిజగల్లు నగరమధ్యమందు గల ఎత్తయిన బండరాయిపైన ఇద్దరూ కలుసుకున్నారు. అక్కడ గిరిజవ్వ, తమ్ముడికి హారతి ఇచ్చి, 'తమ్ముడూ, నీవల్ల కదా, నాకు ఇంతటి మహాపదవి వచ్చింది!' అనేసరికి, వాడు నిజమేనని పొంగిపోయాడు.

మరుక్షణమందే ఆమె శక్తిరూపం దాల్చి ఉగ్రురాలై, 'ద్రోహీ! నావల్ల, నా వెంట వచ్చిన నీవల్ల రామరసనాయకుని ఇల్లూ కూలిపోయింది. మన ఇద్దరివల్లా రెండు వంశాలకూ, అటు ఏడుతరాలా ఇటు ఏడు తరాలా తీరని అపకీర్తి వచ్చింది. మన వంటి మహాపాపులు ఇంకా జీవించి ఉండటం భూమాతకు భారం!' అంటూ, ఆవేశంతో తమ్ముడిని కౌగలించుకొని, ఎత్తయిన ఆ శిఖరంమీదనుంచి కిందికి దూకేసింది!!

పడీపడటంతోనే మారుమాట లేకుండా ఆ రెండు ప్రాణాలూ ఈ లోకం విడిచి పోయినై. గుణమణి, పూజ్యురాలు అని పేరు పొందిన గిరిజవ్వ బలి అయిన ఆ చోటున ఒక గ్రామం వెలిసి, నేటికీ నిలిచి ఉన్నది.






# నాదీ గడ్డం

అనగనగనగా ఒక ఊరిలో ఇద్దరు స్నేహితులు. వాళ్లిద్దరూ బాగా వ్యాపారం చేసి, డబ్బు కూడబెట్టుతున్న వాళ్లే. ఐతే మొదటివాడు కొంచెం ఖర్చుమనిషి. రెండవ వాడికి ఎంత వచ్చినా ఇంకా రావాలి అనే కాంక్ష ఎక్కువ. మొదటి వాడికి నున్నటి గుండు. రెండవవాడు ఏ కారణం వల్లనో గెడ్డం పెంచాడు.

ఒక రోజున ఇద్దరూ సరదాగా మాట్లాడుకొంటూ ఉండగా, మొదటివాడు 'నేస్తం! ఇన్నాళ్లాయె నీ ఎదట అనలేదు కాని, నీ గెడ్డం చూస్తే ఎంతో ముచ్చట వేస్తూందోయ్. ఇంత వరకూ నేనెన్నో గెడ్డాలు చూసుకుంటూ వస్తున్నా. నీ గెడ్డంలాంటి గెడ్డం మట్టుకు మన దేశంలోనే లేదంటే నమ్ము,' అన్నాడు.

ఇందుకు రెండవవాడు మురిసిపోతూ, 'అవును మిత్రమా, అందరూ ఇలాగే అంటున్నారు. అంతే కాదు. ఎంతోమంది నా గెడ్డం మీద కన్ను వేశారు కూడాను. అవకాశం దొరికితే వాళ్లు కొనివేద్దామని కూడా ఉన్నారు,' అని చెబుతూ, తన గెడ్డంలోకి కుడిచేతి ఐదువేళ్లూ పోనిచ్చి ఉత్సాహంతో నిమురజొచ్చాడు.

ఈ మాట వినగానే, మొదటి వాడు ఆత్రంతో 'ఎవడో ఎందుకు? నేనే కొంటా. ఎంతో చెప్పు,' అన్నాడు.

ధనాశ గల రెండవవాడికి మనస్సులో అనేకమైన ఊహలు ఒక్కసారిగా పరుగులెత్తినై. అప్రయత్నంగా మాటవరుసకు ఇలా అనేశాడు. 'అయితే ఒక వెయ్యి మొహరీలు ఇయ్యి చూద్దాం.'

ఎస్. ముకుందరావు

‘ఓ. దానికేం! తప్పకుండా తీసుకో. ఇంకా నువ్వెంత గొప్ప వెల కోరతావో నను కున్నాను నేనూ...’ అంటూ గభీమని జేబులోనించి తీసి కొంత సొమ్ము బయానా ఇచ్చాడు మొదటివాడు.

ఇందుకు రెండవవాడు బిత్తరపోయాడు. మొదటి వాడు ఒకే ఒక షరతు పెడుతూ, ‘అబ్బాయీ! ఇంతటినుంచీ ఆ గెడ్డం నాది. ఐతే, నీ సొమ్ము నీకు పూర్తిగా చెల్లించి నా గెడ్డం నేను తీసేసుకునేవరకూ దాన్ని నీవు జాగర్తగా కాపాడవలసి ఉంటుంది. తెలిసిందా? నా గెడ్డానికి నా ఇష్టప్రకారం తైలం రాయాలి. నేను చెప్పిన విధంగా దానిని కత్తిరిస్తూ ఉండాలి,’ అని హెచ్చరించాడు.

‘ఓస్. దీనికేముంది!’ అని అనుకుంటూ రెండవవాడు వెంటనే వాని షరతుకు అంగీకరించాడు. వ్రాతపూర్వకంగా పత్రాలు రాసుకున్నారు. మొదటివాడు మళ్లీ ఇంకొకసారి హెచ్చరించాడు. ‘అబ్బాయీ! ఇటుపైన ఎవరైనా ఆ గెడ్డాన్ని చూచి, బాగా ఉన్నదీ అని మెచ్చుకున్నట్లయితే, వారితో నువ్వు అయ్యా, ఈ గెడ్డం నాది కాదండి. ఫలానావారిది. ఆయన దీనిని వెల ఇచ్చి కొనేసుకున్నాడు. ఆయన కోసమే నేను దీనిని పోషించుకు వస్తున్నాను, అని ఈ విధంగా చెప్పాలి, తెలిసిందా?’

‘సరే’ అన్నాడు రెండవవాడు. మరునాటినుంచీ వేళాపాళా లేకుండా మొదటివాడు రెండవవాడిదగ్గరకు వస్తూండేవాడు.




‘ఏం నేస్తం ఇలా వచ్చావు?’ అని పలకరిస్తే ‘మరేం లేదు. నా గెడ్డం ఎలా ఉందో చూచుకుపోదామని వచ్చా,’ అనేవాడు.

ఒక్కొక్కనాడు ఉరుములురుముతూ వచ్చి, ‘ఇదేమిటయ్యా, నా గెడ్డమంతా నాశనం చేస్తున్నావే, నిగనిగలాడుతూ మెరిసిపోవలసిన నా గెడ్డానికి చవుకబారు కొబ్బరినూనె పట్టిస్తే ఎలా అనుకున్నావు? ఐనా, తీరూ తెన్నూ లేకుండా ఏమిటీ దువ్వుకోవడం బొత్తుగా నాగరకత అనేది లేకుండా’ అంటూ కసిరి కేకలు వేసేవాడు. ఇలా హయాం చెలాయించేసరికి, రెండవవాడికి ప్రాణం విసిగిపోయింది. స్నేహితుని పోరు పడలేకపోయాడు. ఇద్దరికీ బెడిసింది. ‘బాబూ నీకు పుణ్యముంటుంది.

ఏదో గడ్డితిని ధనాశ చేత ముందువెనుకలు యోచించకుండా ఒప్పుకునాను. నా గెడ్డం మళ్లీ నాకిచ్చెయి. నీ డబ్బు నీవు తీసేసుకో,' అని ప్రాధేయపడ్డాడు.

మొదటివాడు ఒప్పుకోలేదు. రెండవ వాడు 'పోనీ, నీవిచ్చిందానికి రెట్టింపు తీసుకో,' అన్నాడు. మొదటివాడు మాటా డలేదు. రెండవవాడు ఎలా ఐనా ఈ పీడ వదిలించుకుందామనుకొని, 'నాలుగు వేలిస్తాన'న్నాడు. ఇదెంతవరకూ పోతుందో చూదామని, మొదటివాడు వేడుక చూస్తూ బెట్టుగానే ఉంటూ వచ్చాడు.

రెండవవాడికి ఏమీ తోచింది కాదు. గట్టి చిక్కులో పడ్డాడు. ఇలా ఉండగా ఒక నాటి రాత్రి మొదటి వాడు మామూలుగా వచ్చాడు.

రెండవవాడు గాఢనిద్రలో ఉన్నప్పటికీ సంశయించక మొండి చొరవతో గెడ్డం పెట్టుకు లాగాడు. ఆశ్చర్యం, గెడ్డం ఉన్నప ళంగా వాని చేతిలోకి ఊడి వచ్చేసింది. మొదటివాడు గభీమని లేచి, గోల చేసు కుంటూ న్యాయాధిపతి దగ్గరకు పోయి, మొరపెట్టుకున్నాడు.

తెలివిమంతుడైన అధికారి, ఇద్దరి ఉద్దే శాలనూ క్షణంలో గ్రహించివేశాడు. విచా రణ జరిపాడు.

'గెడ్డం నేనూ కొన్నాను. హక్కునాది' అనే ధీమాతో మొదటివాడు స్నేహితుడిని నానాహింసలు పెట్టడం, వాడు పెట్టే యాత నలు పడలేక, రెండవవాడు మాయగెడ్డం అంటించుకోవడం జరిగిందని వెల్లడైంది.

మొదటివాడు అర్ధరాత్రప్పుడు పని కట్టుకు వెళ్లి బలవంతాన లాక్కున్న గెడ్డం తనే పట్టుకుపోవలసిందనీ, రెండవదానికి అతను ఈయవలసిన బాకీ గెడ్డం ఖరీదు ఖర్చులతో సహా తక్షణమే రెండవవాడికి చెల్లించవలసిందనీ న్యాయాధికారి తీర్పు చెప్పాడు.






# సుఖినో భవంతు

'బామ్మా నీకు నాకంటే చింటూ అంటేనే ఎక్కువ ఇష్టం కదా!' అంటూ గారంగా బామ్మను వాటేసుకున్నాడు చిన్నూ.

'అవేం మాటలురా చిన్నూ! బాబాయి కొడుకు చింటూ ఎంతోనువ్వూ అంతే నాకు.' బామ్మ కమలమ్మ చిన్నూ తల ప్రేమగా నిమిరింది.

'మరయితే ఇక్కడికొచ్చి వారమైనా కాకుండా అప్పుడే బాబాయి వాళ్ల ఊరు ఎందుకు వెళ్ళిపోతానంటున్నావు?' నిల దీశాడు చిన్నూ.

''బాబాయిది పల్లెటూరుకదరా? అక్కడ స్వచ్ఛమైన గాలికి నా ఉబ్బసం జబ్బు కాస్త అదుపులో ఉంటుందిరా చిన్నూ! అన్నది బామ్మ 'అలాగయితే దీపావళి ఇంక నాలుగు రోజులేగా ఉంది. పండగెళ్లాక వెళ్లొచ్చు కదా బామ్మా,' చిన్నూ పట్టు విడవలేదు. అమ్మయ్యో ఈ పట్నాల్లో దీపా వళి అంటేనే నాకు గుండె దడ. నాకసలు ఊపిరి కూడా ఆడదురా చిన్నూ!'' అసలు విషయం చెప్పక తప్పలేదావిడకి.

'అదేంటి బామ్మా అలాగంటావు?' బామ్మ మాటల్లో అంతరార్థం తెలియని చిన్నూ విస్తుబోయాడు.

'నాకు తెలుసురా.. దీపావళి అంటేనే పిల్లల పండగ. మీ కుర్రాళ్లకి బోలెడు టపా కాయలు కాల్చాలని ఉంటుంది. మీ వయసుకి అది సహజమే గాని పసిపిల్లలు, ముసలివాళ్లు, ఇంకా నాలాంటి రోగిష్టి వాళ్లకి మాత్రం దీపావళి అమావాస్య అంటే యముడి దర్శనం అయిపోతుందిరా నాన్నా!' చిన్నూకి ఏదో అర్థం అయ్యీ అవన ట్టుంది. 'అంటే మేము టపాకాయలు కాలిస్తే నీ ఆరోగ్యం చెడిపోతుందంటావ్!'

పి.వి. శేషారత్నం



'ఒక్క నా ఆరోగ్యమే కాదురా... క్రితం సారి దీపావళి సందట్లో పడి నువ్వు చూడ లేదు గానీ.. పక్కింటి ముసలాయనకి ఈ గంధకం పొగవల్ల ఆగని టపాసుల గోలవల్ల ప్రాణం మీదికి వచ్చింది కదురా'.

'మరి నరకాసుర వధ గురించి నువ్వే చెప్పావుగా.. ఈ రుతువులో వర్షాలు పడిన నేలమీద విపరీతంగా పెరిగిపోయి మను షుల రక్తం జుర్రుకుని తాగే దోమాసురులనే రాక్షసులను అంతం చేసి మలేరియా వంటి జబ్బులు విజృంభించకుండా చెయ్యడా నికే మనం బాణసంచా కాలుస్తామనేది ఈ పండగలోని అంతరార్థం కదా బామ్మా?'

'అది నిజమేరా చిన్నూ... మనం కాల్చే మతాబులు, చిచ్చుబుడ్లు లాంటి బాణ సంచానుంచి వచ్చే గంధకం పొగ దోమలకు శత్రువే... కాదనను. కాని సరదా పేరుతో అత్యుత్సాహంతో చెవిలోని కర్ణభేరి బద్దల య్యేంత శబ్ద కాలుష్యాన్ని, ధూమ కాలు ష్యాన్నీ పర్యావరణంలోకి వదులుతున్నా మనేది మీ కుర్రకారు మర్చిపోతే ఎలాగరా నాన్నా?' బామ్మ ప్రశ్న మనవడిలో ఆలోచ నని రేపింది.

'నువ్వు చెబుతున్నది నిజమేననిపి స్తోంది బామ్మా.. అసలు ఈ వీధిలోకి ఆ కాంట్రాక్టరుగారి అబ్బాయి వేణు వచ్చిన ప్పటినుంచి తారాజువ్వల పోటీ, టపాసుల పోటీ మొదలైంది. దాంతో ఎంత కాలుస్తు న్నామనేది కూడా చూసుకోకుండా ఏటా మేం పోటీలకి ఉరకలు వేస్తున్నాం.'

'అందువల్ల మీ అమ్మానాన్నలకు అన వసరంగా బోలెడు డబ్బు ఖర్చు అవడమే కాకుండా, మీరు చేసుకునే టపాసుల పండగ ప్రమాదాల సంగతి అటుంచి ఎంతమందికి కష్టం, నష్టం కలిగిస్తోందో తెలుసా? గుండె జబ్బులతోను, శ్వాసకోస వ్యాధులతోను బాధపడే వాళ్లు టపాసుల పొగ, శబ్దాల భీభత్సానికి ఎలా ఉక్కిరిబిక్కి రవుతున్నారో ఎప్పుడైనా గమనించారర్రా?' తన మాటలు మనవడి మనసుమీద ప్రభావం చూపిస్తాయని కమలమ్మకి తెలుసు.

'బామ్మా! ఒక్కటి మాత్రం నిజం.. క్రితం దీపావళికి ఏడాది నిండని చెల్లాయి మాత్రం భయపడిపోయిందో ఏమో గాని, తెల్లవార్లూ ఒకటే ఏడుస్తుంటే నా మనసు నీరయిపోయింది బామ్మా!'

'అవునా మరి.. ఈ లోకంలోకి అడుగు పెట్టి ఎన్నాళ్లో కాని ఆ పసిపిల్ల బయట ఏం జరుగుతోందో తెలియక, బెదిరిపోయి గొంతు అర్చుకుపోయేలా ఏడుస్తూ మీ అమ్మని కరుచుకుపోవడం చూసి మా అందరికీ కళ్లు చెమర్చాయిరా... ఆరోజు అర్ధరాత్రి దాటితే గాని పిల్ల నిద్రోయింది కాదు. అలాగే, ఇక ఎదురింట్లోని పెద్దా యన.. బక్కచిక్కి జవసత్వాలుడిగిపోయి టపాసుల హోరుకు తల్లడిల్లిపోయాడ నుకో.. మాగుండెలు తరుక్కుపోయా యిరా చిన్నూ!' చిన్నూకి బామ్మ ఎందు కలా అంటోందో పూర్తిగా అర్థమయింది.

'ఆయన కంటే కూడా నువ్వు మరీ ఊపిరాడక గిలగిల్లాడి ఉంటావు. అందు కేగా ఇప్పుడు వెళ్లి పోతానంటున్నావ్?'

'పోనీలేరా.. మళ్లీ వచ్చేనెల్లో వస్తానుగా.'

'అదే కుదరదు బామ్మా.. మీ అందరి కంటే, పర్యావరణాన్ని వాయు, శబ్ద కాలు ష్యాలతో నింపేసే మా పిల్లల ఇష్టమేం ముఖ్యం కాదు. అయినాగానీ మా పిల్లల ఇష్టం ఎవరికీ నష్టంగా.. కష్టంగా మారకూ డదు.'

చిన్నూ మాటల్లోని దృఢనిశ్చయానికి బామ్మ కళ్లల్లో ఆనందం.

'అయితే ఇప్పుడే మంటావురా చిన్నూ?' ఏమీ తెలియనట్టే అడిగింది.

'ఈ పండగకి నువ్వెక్కడికీ వెళ్లడానికి వీల్లేదు. ఈ వీధిలో నేనేగా పిల్లల లీడర్ని. ఏడో క్లాసు చదువుతున్న ఈ చిన్నా ఆ మాత్రం మా పిల్లలకి నచ్చచెప్పుకోలేడా? ఈసారి దీపావళిని ధూమకాలుష్యం, శబ్ద కాలుష్యం లేకుండా ఎలా జరిపిస్తానో చూడు. దీపావళి పండుగ ఆనందం ఏ ఒక్కరిదో కాదు. మనందరిదీను.. ఏమం టావు బామ్మా?'

'నా మనవడిననిపిస్తున్నావురా నా బంగారు తండ్రీ! సర్వేజనా సుఖినోభ వంతు, ఏ పండగలోని అంతరార్థమయినా అదే కదరా చిన్నూ!' అంటూ బామ్మ కమ లమ్మ ఆనందంగా కళ్లు తుడుచుకుని మనవడిని మనసారా దీవించింది.



# తాటిచెట్టు - గడ్డిపోచ

ఒక అడవిలో తాటిచెట్టు గడ్డిపోచ ప్రక్క ప్రక్కనే ఉంటుండేవి. తాటి చెట్టు ఎప్పుడూ గడ్డిపోచతో 'ఓయ్! గడ్డిపోచా, నీవు ఎప్పుడు నేలనే అంటిపెట్టుకొని ఉంటావేం ? నేను చూడు ఎంత బలంగా పొడవుగా ఉన్నానో ! అయినా నీకు, నాకు సామీప్యమేమిటి!' అంటూ పరిహాసం చేస్తూ ఉండేది.

దానికి సమాధానంగా గడ్డిపోచ 'ఓ తాటిచెట్టూ! నీవే గొప్పవాడివని విర్రవీగకు ఎంత చెట్టుకు అంతగాలి అని పెద్దవాళ్ళు చెప్పారు. నాకుండే బలం నాకూ ఉందిలే!' అనేది.

ఒకసారి కుండపోతగా వర్షం కురవనారంభించింది. గడ్డిపోచ నీటిలో మునిగిపోయింది.

దాన్ని చూసి తాటిచెట్టు, 'గడ్డిపోచా! నేనూ బలవంతుడినే అని వాదించేవాడివి కదా. ఇప్పుడు ఏమయింది నీ బలం'. అని పకపక నవ్వింది.

కొన్ని రోజులు గడిచాయి. గడ్డిపోచ నిలదొక్కుకుంది.

మరికొంతకాలానికి ఒకనాడు ఈదరగాలులు వీచసాగాయి. ఉరుములు మెరుపులతో వర్షం పడసాగింది. ఆ ఈదురుగాలుల తాకిడికి తాడిచెట్టు నేలకూలింది.

అప్పుడు గడ్డిపోచ విచారవదనంతో 'అయ్యో, మిత్రమా, చూశావు గదా నీ బలం ఏపాటిదో. ఒక్క ఈదురు గాలికి నేల కూలిపోయావు. నేను వర్షానికి పడిపోయినా, తిరిగి యధాస్థితికి వచ్చాను. ఒక్క విషయం తెలుసుకో. క్రింద పడినవారిని, పైకి రమ్మని ప్రోత్సహించాలి. చేతనయితే తనకు తోచిన సహాయం, సలహా ఇవ్వాలి. అంతేగాని పరిహసించగూడదు'. అంటూ మందలించింది.

'ఔను, నువ్వు చెప్పిందే నిజం, నన్ను క్షమించు'. అంటూ తాటిచెట్టు ప్రాణాలు వదిలింది.

*- ఎ. రాంబాబు*





# శిథిలాలయం – 19

(శిఖిముఖీ, విక్రమకేసరీ తమ అనుచరులతో శిథిలాలయ పూజారి ఉన్న ఇంటిని చుట్టుముట్టి నాగుమల్లిని బంధవిముక్తురాలిని చేశారు. పూజారి, సవరభేరుండంతో అరణ్యంలోకి పారిపోయాడు. నాగుమల్లి, శిఖిముఖితో అతడు బ్రహ్మపుత్రా నదీలోయల నుంచి తిరిగి వచ్చేవరకూ తాను పెళ్లాడబోవటం లేదని చెప్పింది. తరవాత–)

శివాలుడు తన అనుచరులందరినీ వెంట బెట్టుకుని మధ్యాహ్నం వేళకు కుంభార మిట్టపల్లె చేరాడు. తాను పల్లెలో లేని సమయాన శిథిలాలయ పూజారి పల్లెపై ఏదైనా అఘాయిత్యం చేసి ఉండవచ్చన్న భయం అతణ్ణి దారి పొడవునా బాధించింది. కాని పల్లె చేరుతూనే అలాంటి ఉపద్రవం ఏదీ జరగలేదని తెలిసి చాలా సంతోషించాడు.

ఇన్నాళ్లకు శివాలుడికి, విక్రమకేసరి తండ్రి జయపాలుడు తనకు పంపిన తాళపత్రాలు తీరిగ్గా చదివిచూసే అవకాశం దొరికింది. జయపాలుడి తండ్రి విక్రమకేసరి రెండవ సారి బ్రహ్మపుత్రా లోయలకు ఎందుకు వెళ్లటం జరిగిందో, వాటిల్లో అతడికి సూచన ప్రాయంగా ఉన్న కొన్ని స్థలాల పేర్ల ద్వారా అర్థమైంది. అతడు ఈ రెండవ యాత్ర పెట్టుకున్నది బ్రహ్మపుత్రానదిలోని అసంఖ్యాకమైన లంకల్లో ఒకటైన వృశ్చికలంక చేరేందుకు. ఆ లంక మీదే శిథిలాలయం ఉన్నదని వాడుక. అందులో అంతులేని ధనకనకాలే కాక, వెలలేని శిల్పసంపద కూడా ఉన్నదని చెబుతారు. విక్రమకేసరి ఆ ధనాన్ని, వీలయితే

దాసరి సుబ్రహ్మణ్యం



అపూర్వ కళాఖండాలుగా చెప్పబడే శిల్పాలనూ తీసుకువచ్చి తన రాజభవనాన్ని అలంకరింప చేయాలనుకున్నాడు.

తాళపత్రాల్లో విక్రమకేసరి ఆ శిథిలాలయాన్ని చేరేందుకు తనకు తెలిసిన వర్తమానమంతా రాశాడు. ఆ దేవాలయం ఇభ్యులనబడే ఆటవికులు కొన్ని వందల సంవత్సరాల క్రితం నిర్మించినది. ప్రకృతి వైపరీత్యాల వల్లా, బ్రహ్మపుత్ర వరదల వల్లా, ఆ లంక చుట్టుపక్కల చాలా ప్రాంతం జలమయం అయిపోయి, కొన్నేళ్లుగా ఆ దేవాలయం ఉన్న లంక ఎక్కడ ఉన్నదో కూడా ఎవరికీ తెలియకుండా పోయింది. కాని ఇభ్యజాతి వాళ్లలో కొందరు వృద్ధులకు మాత్రం ఆ శిథిలాలయం ఉన్న లంకను గురించిన సమాచారం కొంతలో కొంత తెలుసునన్న వాడుక ఉన్నది.

శివాలుడు, వందల సంఖ్యలో ఉన్న తాళపత్రాల్లో అక్కడా ఇక్కడా ఉన్న శిథిలాలయానికి సంబంధించిన విషయాన్ని విక్రమకేసరికి చెప్పి, 'కేసరీ, మీ తాతగారైన విక్రమ కేసరి దొర ఇంకా సజీవుడే అన్న నమ్మకం నాకు లేదు. ఆయన వయసులో నా కన్న చాలా పెద్ద. అంతే కాక ఆ లోయల్లో ఒంటరిగా తిరుగుతూ, విషజ్వరాలకూ వాటికీ గురై ఇంతకాలం సజీవుడై ఉంటాడని నేననుకోను. ఏమైనా, సంగతి మీ నాయనగారితో చెప్పు. ఆయన ఆ ప్రాంతాలకు వెళ్లి తీరాలంటే మనం చేయగలిగిందేమీ లేదు. నీకు తోడుగా శూరసేన దేశం వరకే గాక, ఆ బ్రహ్మపుత్రానదీ లోయలకు కూడా నా కొడుకు శిఖిముఖిని పంపుతున్నాను,' అన్నాడు.

విక్రమకేసరి, శివాలుడికి కృతజ్ఞత తెలియపరిచాడు. మర్నాటి ఉదయం అతడు శిఖిముఖిని వెంటబెట్టుకుని, తన దేశానికి బయలుదేరాడు.

దారిలో దొంగల బెడద గాని, శిథిలాలయ పూజారి నుంచి ఏమైనా ఆపద గాని రావచ్చున్న అనుమానంతో శివాలుడు వారి వెంట దృఢకాయులైన ఇద్దరు శబర యువకులను అంగరక్షకులుగా తోడు పంపాడు.

మార్గమధ్యంలో ఎలాంటి చిక్కులకూ గురి కాకుండానే పక్షంరోజుల తరవాత శిఖిముఖీ, విక్రమకేసరీ శూరసేన దేశం చేరారు. జయపాలుడు విక్రమకేసరి ద్వారా సంగతి సందర్భాలన్నీ తెలుసుకుని ఎంత ప్రమాదంతో కూడిన కార్యం అయినా సరే, తాను తప్పక బ్రహ్మపుత్రానదీ లోయలకు పోయి, తన తండ్రి సజీవుడో కాదో అన్న సంగతి తెలుసుకు తీరాలన్నాడు.

జయపాలుడి ఆలోచనకు మంత్రీ, ఇతర రాజోద్యోగులూ అభ్యంతరం చెప్పారు. కష్టసాధ్యమైన ఈ పనికి యువకుడే తగిన వాడనీ, ఈ వయసులో జయపాలుడు అంత దూరప్రయాణానికి పూనుకోవడం క్షేమం కాదని సలహా ఇచ్చారు. దాని మేరకు జయపాలుడు తన కొడుకైన విక్రమకేసరి పైన ఈ కార్యభారం పెట్టాడు.

ప్రయాణానికి అవసరం అయిన ఏర్పాట్లన్నీ ఒక వారం రోజుల్లో పూర్తయిసై. విక్రమకేసరీ, శిఖిముఖుల వెంట రక్షణగా జయపాలుడు సుశిక్షితులైన ఇద్దరు క్షత్రియ యువకుల్ని పంపేందుకు ఏర్పాటు చేశాడు. అందరూ ఒకనాటి ప్రాతఃకాలాన బ్రహ్మపుత్రానదీ లోయలకు ప్రయాణమయారు.

వాళ్లు బయలుదేరే ముందు జయపాలుడు శిఖిముఖిని ఆప్యాయంగా కౌగలించుకుని, అతడి మెడలో ఒక రక్షరేకు కట్టాడు. అది జయపాలుడికి తన తండ్రి నుంచి లభ్యమయిన తాళపత్రాలు గల



పెట్టెలో దొరికింది. దానిమీద కాళీమాత రూపం చెక్కబడి ఉన్నది.

శిఖిముఖీ, విక్రమకేసరులు తమ ఇద్దరు సహచరులతో నాలుగైదు నెలల కాలం అరణ్యాల్లో, కొండల్లో ప్రయాణించి, చిన్నా పెద్దా నదులను అనేకం దాటి చివరకు కామాఖ్యపురం చేరారు. అక్కడ కొద్ది రోజులపాటు విశ్రాంతి తీసుకుని తరవాత దారిచూపే వాణ్ణెవణ్ణయినా కుదుర్చుకుని ఇభ్యుజాతి వాళ్ళుండే ప్రాంతం చేరాలని వాళ్లు నిర్ణయించుకున్నారు. తాత విక్రమకేసరి ఈ జాతి వాళ్లు నివసించే ప్రాంతాల కొంతకాలం ఉన్నట్టు శూరసేన దేశపు పండితుడు జయపాలుడికి లోగడ చెప్పి ఉన్నాడు.

విక్రమకేసరీ అతడి అనుచరులూ కామాఖ్యపురం చేరి, ఒక సత్రంలో బస చేశారు. ఆ సమయాన పట్టణంలో దేవీ ఉత్సవాలు జరుగుతున్నవి. అవి చూసేం దుకు చుట్టుపక్కల పదీ పన్నెండు కోసుల దూరం నుంచీ కూడా జనం వస్తున్నారు. వీళ్లలో అనేక తెగలవాళ్లూ, జాతులవాళ్లూ ఉన్నారు. బ్రహ్మపుత్రా నదీ లోయల్లో దారి చూపేందుకు నమ్మకస్థుడైన వాడికోసం వెతకడానికి ఇది మంచి అదునుగా శిఖి ముఖికి తోచింది. అతడు విక్రమకేసరినీ, తతిమ్మా యువకుల్నీ వెంటబెట్టుకుని ఉత్సవం జరుగుతున్న ప్రాంతానికి బయ లుదేరాడు. వీధులకు ఇరువైపులా చిన్న చిన్న దుకాణాలు అనేకం వాళ్ల కంటబడిన్నై. ఆ దుకాణాల్లో ఏనుగు దంతంతో చేసిన రరకరకాల వస్తువులూ, పాలరాతితో చెక్కిన విగ్రహాలూ, జంతు చర్మాలతో తయారైన సామగ్రులూ అమ్ముతున్నారు.

నలుగురు యువకులూ ఆ దుకాణా ల్లోని విచిత్ర వస్తువులను చూస్తూ... ముందుకు కదిలారు. వాళ్లకు ఒక వీధి మలుపున ఏనుగు చర్మాలు పరుచుకుని వాటి మీద మానవాస్తికలు పెట్టుకు కూర్చున్న ఒక జ్యోతిష్కుడు కనిపించాడు. పెద్ద గడ్డం, జడలు కట్టిన తలవెంట్రుకలతో ముఖాన ఎర్రని పెద్ద కుంకుమ బొట్టుతో, అతడు చూపరుల్ని బాగా ఆకర్షిస్తున్నాడు. శిఖిముఖీ వాళ్లూ అతడి కేసి ఓ క్షణకాలం చూసి ముందుకు కదలబోయేంతలో, జ్యోతిష్కుడు, 'శూరసేన దేశపు కేసరీ, ఆగు! ఒక్కమాట' అన్నాడు పెద్ద గొంతుతో.





శిఖీ, భూతభవిష్యత్ వర్తమానాలు అన్నీ ఉన్న ఫళాన చెప్పగలను. మీరిక వచ్చిన దారినే ఇంటికి తిరిగి పోండి. వృద్ధ విక్రమ కేసరి బతికిలేడు. పైగా మీరు వెయ్యేళ్ల వయసు గల మహాశక్తిమంతుడితో విరోధం తెచ్చుకున్నారు. సాహసించి బ్రహ్మపుత్రా నదీ లోయల్లోకి పోయారో, మీరు బలవన్మ రణం పొందుతారు,' అన్నాడు.

ఆ మాటలు వింటూనే విక్రమ కేసరి కత్తి దూయబోయాడు. శిఖిముఖి అతణ్ణి వారించి చిన్న గొంతుతో, 'కేసరీ! తొందర పడకు. మనం ఉన్నది దేశం కాని దేశం. ఈ కపట జ్యోతిష్కుడు శిథిలాలయ పూజారి మిత్రుడో, సేవకుడో అయి ఉంటాడు. ఆ దుర్మార్గుడి ద్వారానే వీడు మనను గురించి విన్నాడు. అంటే దాని అర్థం, ఆ పూజారి, ఈ పట్టణంలోనే ఎక్కడో ఉన్నాడన్నమాట. మనను ఇన్నాళ్ళుగా ఒక కంట పెట్టే వున్నా డని తెలుస్తున్నది గదా!' అన్నాడు.

'నాకూ అలాగే తోస్తున్నది. మొత్తానికి ఆ దుర్మార్గుడి పీడ విరగడైపోయిందని అనుకున్నాను. సరే, మనం ఇక ఈ జనంలో తిరగటం మంచిది కాదు. వాడి బంట్లు మనను చాటు నుంచి దెబ్బ తీయవచ్చు. మన విడిది సత్రంకు పోదాం పదండి,' అన్నాడు విక్రమకేసరి.

నలుగురూ ఓ అరగంట తరవాత సత్రం దగ్గిరకు వచ్చేసరికి, సత్రం యజమాని వాళ్లతో, 'మీ గురువుగారు, మీ విడిదిగదిలో

తనను ఆ విధంగా పేరుపెట్టి పిలిచిన జ్యోతిష్కుడి కేసి ఆశ్చర్యంగా చూస్తూ విక్రమకేసరి నిలబడ్డాడు. జ్యోతిష్కుడి చేత సాముద్రికం చెప్పించుకుంటున్న కొందరు విక్రమకేసరినీ, అతడి వెంట ఉన్న వాళ్లనూ పరీక్షగా చూడసాగాడు.

శిఖిముఖీ జ్యోతిష్కుడి కేసి రెండడు గులు వేసి, 'అయ్యా, చేయి చూసి మను షుల పేర్లు చెప్పే జ్యోతిష్కులను కొందరిని నేనెరుగుదును. కాని, మీరు మనిషి ముఖం చూసి పేరూ, ఊరూ తెలుసుకో గలిగారు. లోగడ మా ప్రాంతాల్లో ఏమన్నా ఉన్నారా?' అని అడిగాడు.

జ్యోతిష్కుడు వికవికమంటూ నవ్వి, 'నేను అఘోరీ జ్యోతిశ్శాస్త్ర పండితుణ్ణి.

ఉన్నారు. ఓ గంట కాలంగా మీకోసం ఎదురు చూస్తున్నారు,' అని చెప్పాడు.

సత్రం యజమాని ఇలా అనగానే, నలుగురూ ఎక్కడలేని ఆశ్చర్యం పొందారు. శిఖిముఖి సత్రం యజమాని కేసి అను మానంగా చూస్తూ, 'మాకు గురువంటూ ఎవరూ లేరు. వాడెవడో దొంగ అయి ఉంటాడు. మేం దిగిన గదిని వాడికి చూపావా?' అని అడిగాడు.

సత్రం యజమాని కళవెళపడిపోతూ, 'గది చూపాను. అతడు గొప్ప కాళీ భక్తు డిలా ఉన్నాడు. ఏదో గుడికి పూజారిననీ, మీకు ఎంతో కాలంగా గురువున'నీ చెప్పాడు, అన్నాడు.




'సరే, వాడి సంగతి మేం చూసు కుంటాం. మా గది వైపునుంచి కేకలూ అరుపులూ వినిపించినా, ఓ అరగంట వరకూ అటు కేసి ఎవర్నీ రానీయకు,' అంటూ శిఖిముఖి గబగబా మిద్దెపై ఉన్న తమ గదికేసి బయలుదేరాడు. విక్రమ కేసరీ, క్షత్రియ యువకులిద్దరూ అతడి వెనకనే నడిచారు.

విక్రమ కేసరీ వాళ్లూ విడిదికని తీసు కున్న గది తలుపులు బార్లా తెరిచి ఉన్నవి. అందరి కన్న ముందు నడుస్తున్న శిఖిముఖి గదిలో అడుగు పెడుతూనే శిథిలాలయ పూజారిని చూశాడు.

పూజారి ఒక చిన్న కొయ్యపెట్టెను బద్దలు కొట్టేందుకు ఒక చురకత్తి పిడితో దానిమీద బలంగా కొడుతున్నాడు. శిఖిముఖి వాకి ట్లోకి రాగానే పూజారి తల ఎత్తి అతడి కేసి చూసి, వికృతంగా నవ్వుతూ, 'శిఖీ, భలే! మంచి సమయానికే వచ్చావే, సరే, నువ్వూ నీ స్నేహితులూ అక్కడే గడప దగ్గరే ఆగండి. ఈ తుక్కుపెట్టెను తెరిచేందుకు నా మంత్ర శక్తిని వృధా చెయ్యటం ఎందుకని ఈ చుర కత్తిని వాడుతున్నాను,' అన్నాడు.

శిఖిముఖి గడప దగ్గరే ఆగి, వెనక నిల బడివున్న క్షత్రియ యువకులైన అజితు డికీ, వీరభద్రుడికీ కనుసైగతో ద్వారాన్ని కాపలా కాయమని హెచ్చరించి, ముందుకు రెండడుగులు వేసి, 'పూజారీ, ఆ పెట్టెలో శిథిలాలయానికి పోయేందుకు అవసరం అయిన దారి గుర్తులు గల తాళపత్రం ఉన్న

దనుకుంటున్నావా? ఊహు, అది అక్కడ లేదు. అదుగో, కేసరి దాన్ని సర్వదా తన దుస్తుల్లో దాచుకు తిరుగుతున్నాడు. కొంచెం దగ్గరకొచ్చి, అడుగు, ఇచ్చేస్తాడు,' అన్నాడు.

విక్రమ కేసరి తన దుస్తుల్లో నుంచి ఒక పెద్ద తాళపత్రం తీసి పూజారి కేసి రెపరెప లాడించాడు. పూజారి దాన్ని చూస్తూనే పళ్లు కొరికి, 'దానికోసం అడగాలా? అడుగుతున్నాను. నోటితో కాదు కత్తితో!' అంటూ తన చేతుల్లో ఉన్న చురకత్తిని విక్రమకేసరి కేసి విసిరాడు.

రానున్న ప్రమాదాన్ని ముందుగానే గుర్తించిన శిఖిముఖి, విక్రమకేసరిని భుజాలు పట్టుకుని కిందికి లాగాడు. చురకత్తి రివ్వుమంటూ పోయి ద్వారబంధానికి బలంగా గుచ్చుకుపోయింది.

శిఖిముఖి, పూజారిని పట్టుకునేందుకు ముందుకు దూకేంతలో అతడు గది వెనక వున్న పిట్టగోడ మీంచి కిందికి దూకేశాడు. నివ్వెరపోయిన శిఖిముఖి, విక్రమకేసరీ పిట్టగోడను ఒక్క తృటికాలం ఆలస్యంగా చేరారు.

పూజారి అంత ఎత్తు నుంచి కిందపడి మరణిస్తాడని వాళ్లనుకున్నారు.

కాని, మిద్దె కింది ఆవరణలో నిలబడి ఉన్న సవరభేరుండం, పూజారి నేల తాకకుండా మధ్యలోనే పట్టుకుని, అతడిని దాపుల ఉన్న రెండు గుర్రాల్లో ఒకదాని మీదఎక్కించి, తాను రెండో గుర్రం మీదికి లంఘించాడు.

శిఖిముఖి చప్పున వెనక్కు తిరిగి, 'అజితా! వీరభద్రా! మీరు సత్రం ఆవరణలోకి పరిగెత్తి, గుర్రాలమీద పారిపోతున్న ఆ దుర్మార్గుల్ని పట్టుకోండి!' అని పెద్దగా కేకపెట్టాడు. అజితుడూ, వీరభద్రుడూ ఒక్కుదుటున కిందికి పరిగెత్తారు.

(ఇంకా ఉంది)



# ఆశ - నిరాశ

అగ్రహారంలో పక్క పక్క ఇళ్లలో ఉండే రంగనాథం, రామనాథం మంచి మిత్రులు. రంగనాథానికి ఒక కొడుకు, కూతురూ ఉన్నారు. రామనాథానికి ఒక కూతురు ఉంది. ఇద్దరూ వ్యవసాయం చేసేవారు. రంగనాథం కొడుకు చదువుకుని ఉద్యోగ ప్రయత్నాలు మొదలు పెట్టాడు. నగరంలో దాదాపుగా ఒక ఉద్యోగం ఖాయమైంది. కాని ఎందువల్లో చివరినిమిషంలో తప్పిపోయింది.

ఇంకొన్ని రోజులకు రంగనాథం కూతురు చంద్రమతికి పెళ్లి చూపులు జరిగాయి. మగపెళ్లివారికి చంద్రమతి నచ్చింది. ఆమెతో వివాహసంబంధం తమకు సమ్మతమేనని చెప్పి వెళ్లారు. తర్వాత నాలుగు రోజులకు చంద్రమతిని పెళ్లి చేసుకోబోవడం లేదని వారు మధ్యవర్తితో కబురు చేశారు. అయినా ఈ రెండు సంఘటనలకీ రంగనాథం బాధపడుతున్నట్లుగా రామనాథానికి కనపడలేదు.

ఇక రామనాథం కూతురు పద్మావతికి కూడా పెళ్లిచూపులు జరిగి పిల్ల బాగా నచ్చిందని చెప్పి వెళ్లారు మగ పిల్లవాడి తల్లిదండ్రులు. నిశ్చితార్థం కూడా అయింది. కానీ ఒక రోజు వారు రామనాథం సంబంధాన్ని వదులుకుంటున్నట్లు కబురు చేశారు. కూతురి పెళ్లి జరుగుతుందని ఆశతో ఉన్న రామనాథం ఆ వార్త విని దుఃఖ పడ్డాడు. రంగనాథం మిత్రుడిని ఓదార్చాడు.

'నీకూ ఇలాగే జరిగినా నువ్వు బాధపడకుండా ఎలా ఉన్నావో అర్థం కాలేదు,' అన్నాడు రామనాథం మిత్రుడితో. రంగనాథం నవ్వి, 'ఆశపడినప్పుడే దుఃఖం కలుగుతుంది. నేను పని ప్రారంభించినప్పుడు ఆ పని జరక్కపోయినా, బాధపడకూడదని ముందుగానే అనుకుంటాను. అందుకే బాధనిపించదు. నువ్వలా కాదు. ఆశపడతావు. ఆశించినది జరక్కపోతే బాధపడతావు. దుఃఖమనేది నిరాశను వెన్నంటే ఉంటుంది' అన్నాడు.

- ప్రతాప రవిశంకర్





# ప్రజాహితం

మహారాష్ట్ర దేశంలో ఇందూరు సంస్థానాన్ని రాణి అహల్యాబాయి పాలించే కాలంలో వినాయకరావు గంధేకర్ అనే సంగీత విద్వాంసుడుండేవాడు. అతడు గొప్ప కవీ, భక్తుడూ కూడానూ. అందుచేత అతడు భక్తిరసప్రధానములైన కీర్తనలు రచించి, వాటికి తానే సంగీతం జతచేసి, పాడి అందరికీ వినిపిస్తూండేవాడు.

కవిగానూ, గాయకుడు గానూ గంధేకర్ కీర్తి నలుదిశలా వ్యాపించింది. నిత్యమూ ఆయన ఇంటికి ఎందరో భక్తులూ, సంగీత ప్రియులూ, ధనికులూ, జమీందారూ కూడా వచ్చి, కానుకలర్పించి పోతుండేవారు.

ఇలా వచ్చిన ధనంతో గంధేకర్ బీదసాదలకు సంతర్పణలు చేసేవాడు. ఈ విధంగా ఎంత డబ్బు వచ్చినా ఖర్చయిపోతూ ఉండేది. ఎంత ఖర్చు చేసినా మళ్లీ కానుకల రూపంలో వచ్చి పడుతూండేది.

గంధేకర్ జీవితానికి ఏ కొరతా లేదు – సంతానం లేకపోవటం తప్ప. చివరకాయన బిడ్డలు లేకుండానే తన ఇష్టదైవమైన పాండురంగడిలో ఐక్యమయ్యాడు. ఆఖరు క్షణంలో ఆయన తన భార్య అయిన రుక్మాబాయిని పిలిచి ఈ విధంగా చెప్పాడు.

'రుక్మా, మనకు బిడ్డలు లేరు. అయితే మానవులకు బిడ్డలు మాత్రమే సంతానం కాదు. సప్తసంతానాలలో ఏ ఒకటీ నేను సాధించలేదు. కనుక నా అనంతరం మన దగ్గిర ఉన్న డబ్బుతో ఆలయాలూ, చెరువులూ, నూతులూ, సత్రాలూ మొదలైనవి ఏర్పాటు చేయించు' ఇదే నా కోరిక.

భర్త పోయాక రుక్మాబాయి ఆ విధంగానే చేయ నిశ్చయించింది. కాని ఒక

పాలంకి వెంకటరామచంద్రమూర్తి

ఆవాంతరం వచ్చి పడింది. ఒకనాడు ఇందూరు సంస్థాన సేనాధిపతి తుకాజీ తన భటులతో వచ్చి గంధేకర్‌కు బిడ్డలు లేరు గనక, శాసనం ప్రకారం, అతని ధనం యావత్తూ రాణీగారికి ఒప్పగించమన్నాడు.

రుక్మాబాయి తన జీవనభృతికి అందులో కొంత మాత్రమే మిగుల్చుకోవచ్చును.

రుక్మాబాయి తుకాజీకి తన భర్త తుది కోర్కె వివరించి చెప్పింది. కాని శాసనం ఇలా ఉన్నప్పుడు తుకాజీ ఏం చేయగలడు? గంధేకర్ ధనాన్ని పట్టించుకుపోయి రాణిగారి ఖజానాకు చేర్చాడు.

రుక్మాబాయి రాణి అహల్యాబాయి వద్ద అర్జీ పెట్టుకున్నది. రాణిగారి కొలువుకు వెళ్లి తన భర్తకు చెందిన ధనాన్ని తనకు తిరిగి ఇప్పించినట్లయితే ఆయన తుది కోర్కె ప్రకారం చెరువులూ, బావులూ, ఆలయాలూ, సత్రాలూ కట్టిస్తానన్నది.

రాణి అహల్యాబాయి రుక్మాబాయి చెప్పినదంతా విని, గంధేకర్ ఇంటినుంచి తెచ్చిన సొమ్ము తిరిగి ఇచ్చివేయవలసిందిగా తుకాజీకి ఉత్తరువు ఇచ్చింది. తుకాజీ నిర్ఘాంతపోయి, 'దేవీ, ఇది శాసనానికి విరుద్ధం!' అన్నాడు. 'ఈ సొమ్ముతో మనం ఏం చేస్తాం?' అని అడిగింది రాణి తుకాజీని.

'చెరువులు, బావులు తవ్వించటం, సత్రాలు కట్టించడం వంటి ప్రజోపయోగాలకు ఖర్చు పెడతాం!' అన్నాడు తుకాజీ.

'అవును. ఈ రుక్మాబాయి కూడా ఈ ధనాన్ని అందుకే ఖర్చు పెడుతుంది. ఇక తేడా ఏమంటే మన అధికారులు కేవలం జీతాలకొరకు పని చేస్తారు. ఈమె అలా కాక, తన భర్తమీది భక్తితో ఇవే పనులు స్వయంగా చేయిస్తుంది. ఇందులో ఒక్క చిల్లిగవ్వ కూడా జీతం కింద పుచ్చుకోదు. కనుక ఆ ధనం ఆమెకు తక్షణం ఇచ్చి వెయ్యి,' అని రాణి అహల్యాబాయి తుకాజీకి ఆజ్ఞాపించింది.

రాణిగారి తీర్పుకు ఇందూరు సంస్థాన ప్రజలందరూ చాలా సంతోషించారు.



# తెలివైన కోతి

ఒక కోతి నది అవతల ఉన్న అరణ్యానికి వెళ్ళేందుకు బయలుదేరింది. కాని నది నిండుగా ప్రవహిస్తున్నది. అందులో చాలా మొసళ్లు కూడా తిరుగుతున్నాయి.

కోతి కొంచెం సేపు ఆలోచించి, నది ఒడ్డునే ఉన్న ఒక మొసలిని 'మిత్రమా, కులాసాయేనా?' అని అడిగింది.

'ఓ కులాసాయే,' అంటూ మొసలి తోక ఆడించింది.

'కుటుంబంలో అందరూ కులాసాగా ఉన్నారా? ఎలా అయినా, నా కుటుంబం అంత పెద్దది కాదనుకుంటాను నీ కుటుంబం. మేం వందమందిమి!' అన్నది కోతి.

'మేం అంతకంటే ఎక్కువే!' అన్నది మొసలి గర్వంగా.

'అసంభవం, నేను నమ్మను' అంటూ కోతి కిచకిచలాడింది.

'నమ్మవా? అయితే మా వాళ్లందర్నీ పిలుస్తాను ఉండు,' అంటూ మొసలి తన భార్యల్నీ, కుమాళ్లనీ, కూతుళ్ళనీ, అల్లుళ్లనీ అందర్నీ కేకవేసింది.

కేక వింటూనే బిలబిలమంటూ నదిలో ఉన్న మొసళ్లన్నీ పైకి తేలాయి.

కోతి తలాడిస్తూ, 'అన్నీ కలిపి యాభై కంటే ఎక్కువ ఉన్నట్లు లేదు', అన్నది.

'నువు పొరపడుతున్నావు. లెక్క పెట్టుకు చూడు,' అన్నది మొసలి.

కోతి నది ఒడ్డునే ఉన్న మొసలి వీపు మీదికి ఎక్కి, 'ఒకటి, రెండు, మూడు,' అంటూ ఒకదానిమీదినుంచి మరోదాని వీపుమీదికి ఎగురుతూ, నది అవతలి ఒడ్డుకు ఒక దూకు దూకి, 'మీ అందరికీ చాలా కృతజ్ఞుణ్ణి. నది దాటేందుకు నాకు, భలే వంతెన అమర్చి పెట్టారు!' అని అడివిలోకి పరిగెత్తింది.





# ఔదార్యం

పూర్వం శివసతీపురంలో నీలవర్మ, లుబ్ధవర్మ అనే ఇద్దరు మిత్రులుండేవారు. ఇద్దరూ స్థానికంగా దొరికే సుగంధ ద్రవ్యాలు, ఔషధమూలికలు, ముత్యాలు, రంగురాళ్లు సేకరించి సుదూర దేశాలతో వ్యాపారం చేస్తుండేవారు. విశేష లాభాలార్జించి అచిరకాలంలోనే శ్రీమంతులయ్యారు. నీలవర్మ తనకొచ్చిన లాభాలలో కొంతభాగంతో ఆయా దేశాలలో ప్రజల కోసం సంక్షేమ పనులు చేయగా లుబ్ధవర్మ ఇబ్బడిముబ్బడిగా వచ్చిన లాభాలను పోగేసుకొని ఆనందించేవాడు. కాని అతడి ఆనందం నీలవర్మకొచ్చిన కీర్తి ప్రతిష్టల ముందు దిగదుడుపే అయింది.

ఒక రోజు లుబ్ధవర్మ నీలవర్మ ఇంటికి వెళ్ళి, 'మిత్రమా! ఆర్జించిన ధనాన్ని ఇష్టానుసారం ఖర్చు చేస్తున్నావు. వయసులో ఉన్నంత వరకు బాగానే సంపాదించగలం కాని వృద్ధులమయ్యాక ఇప్పటిలాగ సంపాదించగలమా? భవిష్యత్తు గురించి కూడా మనమాలోచన చేయగలగాలి. మనవద్ద డబ్బు లేనప్పుడు మన అవసరాల కెవరు ఆదుకుంటారు? మన కుటుంబాల గతేమిటి? అందుకే భవిష్యత్తును దృష్టిలో పెట్టుకుని డబ్బును దాచుకోవడం మంచిది!' అని నీలవర్మ చేస్తున్న దానధర్మాలకు అడ్డుకట్ట వెయ్యడానికి ప్రయత్నించాడు.

నీలవర్మ మిత్రుని అంతరంగం గ్రహించి, 'లుబ్ధవర్మా, మనకొచ్చే లాభాలన్నీ ఆయా దేశప్రజల నుంచి సంపాదన చేసేదే కదా, భవిష్యత్‌ను నేను

బెలగాం భీమేశ్వరరావు



వాదనతో ఏకీభవించలేక పోయాడు. మధ్యేమార్గంగా ఒక నిర్ణయానికి వచ్చాడు. కుటుంబ సభ్యులకు కూడా ఆ నిర్ణ యాన్ని తెలుపలేదు.

కాలం సాగుతోంది. ఇద్దరు మిత్రుల వ్యాపారం మూడు పువ్వులారుకాయ లుగా వర్ధిల్లుతోంది. దేశదేశాలలో నీల వర్మ కీర్తిని చెవులారా విన్న లుబ్ధవర్మ, 'ముందు ముందు కాలంలో నా పథకం ఆచరణలో పెట్టేటప్పుడు నా కీర్తి ముందు నీలవర్మ కీర్తి దిగదుడుపే అవుతుంది. అప్పుడు నీలవర్మ నా ఆలోచనను ప్రశం సించక మానడు,' అనుకోసాగాడు.

రోజులు గడుస్తున్నాయి ఒకరోజు హఠాత్తుగా లుబ్ధవర్మ అనారోగ్యానికి గురయ్యాడు. పక్షవాతం వచ్చి కాలూ చెయ్యి పడిపోయింది. నోరు కూడా పడిపోయింది. అంతే, లుబ్ధవర్మ ఆలో చనలన్నీ తలక్రిందులయ్యాయి. కొడు కులు స్థానికంగా ఉన్న వైద్యులకు తండ్రిని చూపించారు. ఫలితం కనిపించ లేదు. వైద్యులు తమ అశక్తతను తెలియ పరిచారు.

లుబ్ధవర్మకు ఆరోగ్య విషయం పూర్తిగా అవగతమయింది. ఏదో చెప్పా లని ఆరాటం. కాని అతడు చెప్పలేడు. అందుకు శరీరంలో ఏ అంగమూ సహ కరించలేదు. దేశదేశాలలో తన కీర్తిని ఇనుమడింపజేసుకోడానికి తను దాచి

పూర్తిగా విస్మరించలేదు. నా కుటుంబం కోసం నా కొచ్చే లాభాలతో కొంతమేర ఆదా చేస్తున్నాను. లక్షాధికారైనా లవణ మన్నమే తింటాడన్న పెద్దల సూక్తి విన లేదా? భవిష్యత్తు పేరుతో కోట్లు కోట్లు పోగు చేయడం నాకు నచ్చదు. అందుకే అవసరం మేరకు వెనకేసుకొని మిగిలి నది దానధర్మాలు చేస్తున్నాను. అలాగ చెయ్యడంలో వచ్చే సంతృప్తికి ఏదీ సాటి రాదు,' అని తెగేసి చెప్పాడు.

లుబ్ధవర్మకు నీలవర్మ మాటలు నచ్చ లేదు. అయినా వాదనకు దిగకుండా ఇంటికి వెళ్లి ఆలోచించాడు. నీలవర్మ వాదనలోనిజం కొంత లేకపోలేదని గ్రహిం చాడు. అంతమాత్రాన పూర్తిగా నీలవర్మ

ఉంచిన అపార నిధిరాశులు గుర్తుకు తెచ్చుకుని తల్లడిల్లసాగాడు.

విదేశాలలో ఉన్న నీలవర్మకు లుబ్ధ వర్మ అనారోగ్య విషయం తెలిసింది. చాలా బాధపడ్డాడు. విదేశాలలో ఉన్న వైద్య నిపుణులను వెంటబెట్టుకుని లుబ్ధ వర్మ ఇంటికి తీసుకెళ్లాడు. ఆ వైద్యులు రోగిని పరీక్షించి కొంతవరకు నయం చేయవచ్చని అభయమిచ్చారు.

లుబ్ధవర్మ మిత్రుని చూసి పశ్చాత్తాప పడ్డాడు. మిత్రుడి కన్న ఎక్కువ కీర్తి ప్రతి ష్ఠలు పొందడానికి తను దాచి ఉంచిన నిధులు ఎవరికీ తెలియకుండా భూస్థా పితమవబోతున్నందుకు వెక్కి వెక్కి ఏడ్చాడు తప్ప ఏమీ చెప్పలేకపోయాడు. మిత్రుడి దీనస్థితిని చూసి నీలవర్మ విచారపడ్డాడు.

వైద్యులు లుబ్ధవర్మకు వైద్యం ప్రారం భించారు. వైద్యం ప్రారంభించిన కొద్ది రోజుల్లోనే లుబ్ధవర్మ తేరుకున్నాడు. కాళ్లూ చేతులూ స్వాధీనమయ్యాయి. మాట కూడా వచ్చింది. వెంటనే నీల వర్మను పిలిపించి విదేశాలలో తను ఎక్క డెక్కడ నిధులు దాచాడో ఆ రహస్యం చెప్పి ఆయా దేశాల ప్రజలకు ఉపయో గపడేటట్టుగా వైద్యశాలలు, అన్నస త్రాలు కట్టించమని అర్థించాడు.

లుబ్ధవర్మ మారినందుకు నీలవర్మ చాలా సంతోషించాడు. అలాగే చేస్తానని లుబ్ధవర్మకు మాటిచ్చాడు. వెంటనే అమలు పరిచాడు.

నీలవర్మ కీర్తితో పాటు లుబ్ధవర్మ కీర్తి కూడా మారుమ్రోగింది. లుబ్ధవర్మ ఆనం దించాడు. అప్పటినుంచి కుమారుల సహాయంతో మాతృదేశంలోనే వ్యాపారం నిర్వహించి, ప్రజాహిత కార్యక్రమాలు చేపట్టి శేషజీవితాన్ని సద్వినియోగం చేసుకున్నాడు.



# అట్టమీది బొమ్మ



## దీపావళి – దీపాల పండుగ

మనదేశంలో సకల జనులూ సంబరంగా జరుపుకునే దీపావళి పండుగను వర్ణిస్తున్న చిత్రాన్ని ఈ నెల అట్టమీది బొమ్మగా మీరు చూడవచ్చు. ప్రజలు జరుపుకుంటున్న పండుగలన్నీ ఏక సూత్రత కలిగి ఉండటమే మన దేశ విశిష్టత. దక్షిణ భారతదేశంలో శ్రీకృష్ణుడు, సత్యభామ–భూదేవి అవతారం– చేత నరకాసురుడు వధించబడిన ఘటనను సూచిస్తూ దీపావళి జరుపుకుంటారు. అదే ఉత్తర భారతదేశంలో అరణ్యవాసం నుంచి సీతారాములు తిరిగి రావడానికి గుర్తుగా దీపావళిని జరుపుకుంటారు.

పండుగలను ఇలా విభిన్న అర్థాలతో జరుపుకోవడం కూడా మన దేశ సాంస్కృతిక సుసంపన్నతకు నిదర్శనం. ప్రతి సంవత్సరమూ పండుగలను ఒకేలా జరుపుకుంటుంటాము కాని విభిన్న ప్రాంతాల్లో విభిన్న ఉపకథల నేపథ్యంలో ఇవి జరుగుతుంటాయి. ఇవి పండుగలకు మరింత వన్నె తెస్తూ సంతోషం కలిగిస్తుంటాయి.

1951 నవంబర్‌లో చందమామ సంపాదక బృందం హిందీ చందమామకోసం మాత్రమే దీపావళి సంచికకు ప్రత్యేక చిత్రాన్ని తీసుకురావాలని నిర్ణయించింది. అప్పట్లో చందమామ కార్యాలయంలో పనిచేస్తున్న చిత్రకారులు శ్రీ ఎంటివి ఆచార్యను ఈ ప్రత్యేక చిత్రం గీయవలసిందిగా కోరారు.. తెలుగుతో సహా ఇతర భాషల చందమామ సంచికలన్నింటిలో, దేవుడి అనంత రూపాలను నారదుడు దర్శిస్తున్న దృశ్యాలతో కూడిన ముఖచిత్రం నాటి దీపావళి సంచికలో వేశారు. ప్రస్తుత పద్ధతికి భిన్నంగా ముఖచిత్రం మీద ఉండే చందమామ పేరును కూడా ప్రతి భాషలోని ప్రతి సంచికలోనూ అప్పట్లో చిత్రకారులే ముఖచిత్రంలో భాగంగా విడివిడిగా చేత్తో రాసేవారు. అయితే అప్పట్లో హిందీ చందమామలో మాత్రమే వచ్చిన ఈ దీపావళి ప్రత్యేక చిత్రంలోని హిందీ చందమామ పేరును ఇప్పుడు తొలగించి, ఆయా భాషల చందమామల పేర్లను కొత్తగా జతపర్చాము.

ఆరోజుల్లో ప్రజలు గడిపిన జీవితంలోని నిరాడంబరతను, తల్లీ పిల్లలు దీపావళిని జరుపుకుంటున్న ఆనంద క్షణాలను ఎంటివి ఆచార్యగారు ప్రతిభావంతంగా ఈ ముఖచిత్రంలో చిత్రించారు. తల్లీపిల్లలది స్వల్ప సంతోషమే కాని దానికి వెలకట్టలేము.

హిందీ చందమామలో మాత్రమే వచ్చిన ఆనాటి ఈ ముఖచిత్రాన్ని 2011 అక్టోబర్ దీపావళి సంచిక ముఖచిత్రంగా 12 భాషల చందమామల్లో తిరిగి ముద్రించటమైనది.

ఈ చిత్రం పాఠకులను అలరిస్తుందని భావిస్తున్నాము.

చందమామ పాఠకులందరికీ దీపావళి హార్దిక శుభాకాంక్షలు.

# కెరీర్ అంటే?



ఎప్పుడు విమానం ఎక్కినా నా మనసులో కొన్ని సందేహాలు పుడుతూనే ఉంటాయి. విమానం నడపడం పైలట్ ఎలా నేర్చుకుంటాడు? నాన్న కారుకు లైసెన్స్ ఉన్నట్లుగా పైలట్‌కు కూడా లైసెన్స్ ఉంటుందా? ఇలాంటి అనేక ప్రశ్నలు నా మనస్సును తొలుస్తుంటాయి. నేను ఒక కెరీర్ సలహాదారుని కలిసి వీటిపై నా సందేహాలు తీర్చుకున్నాను.

పైలట్‌గా కెరీర్ ఎంచుకోవడం చాలా ఉద్వేగంతోనూ, గొప్ప అనుభూతితోనూ ఉంటుందని ఆమె నాతో చెప్పింది. పైలట్‌గా కెరీర్ ఎంచుకోవాలంటే అవసరమైన అనేక నైపుణ్యాల గురించి కూడా ఆమె వివరించింది. విమాన పైలట్లు వృత్తి నైపుణ్యం కలవారు. పలురకాల విమానాలు, హెలికాప్టర్లను నడపడంలో వీరు కఠిన శిక్షణ పొంది ఉంటారు. వృతినిపుణుడైన పైలట్ సామర్థ్యాలు విమానాన్ని నియంత్రించడం, సంక్లిష్ట పరిస్థితులలో సరైన నిర్ణయాలు తీసుకోవడంతో ముడిపడివుంటాయి. ఎందుకంటే ఇలాంటి సందర్భాలలో సమయం చాలా విలువైనది. ప్రయాణీకుల భద్రతకు పైలటే పూర్తిగా పూచీపడాలి. చాలామంది పైలట్లు వాణిజ్య విమానాలను నడుపుతుంటారు. కొంతమంది పైలట్లు అర్ధరాత్రి సరుకుల రవాణాకు విమానాలు, సరుకుల విమానాలను స్వంతంగా నిర్వహించే సంస్థలు, కార్పొరేషన్లలో కూడా పనిచేస్తుంటారు.

పైలట్ మానసికంగా, శారీరకంగా స్వస్థుడై, అప్రమత్తతో వ్యవహరించాలి. చక్కని కంటి చూపుతో, చురుకైనమనస్సును కలిగి ఉండాలి. మారుతున్న పరిస్థితులపై సత్వరం స్పందించడానికి సిద్ధంగా ఉండాలి. ఆత్మవిశ్వాసాన్ని, స్వీయ నాయకత్వ, సాంకేతిక నైపుణ్యాలతో వ్యవహరించాలి.

పైలట్ శిక్షణ పొందేందుకు కనీస వయో పరిమితి 17 సంవత్సరాలు. అభ్యర్థి ప్లస్ టూ సరిసమాన విద్యను కలిగి ఉండాలి. భౌతికశాస్త్రం, గణితశాస్త్రం సబ్జెక్టులు చదివి ఉండాలి. పౌర విమానయాన శాఖ డైరెక్టరేట్ జనరల్ నిర్దేశించిన వైద్య ప్రమాణాలను అందుకోగలగాలి. పైలట్ శిక్షణ లేదా వాణిజ్య పైలట్ లైసెన్స్ పొందడానికి కనీసం 25 లక్షల రూపాయల వరకు ఖర్చవుతుంది. ఎగురుతున్న విమానంలో 200గంటల శిక్షణ, పౌరవిమానయాన శాఖ డైరెక్టరేట్ జనరల్ నిర్వహించే థియరిటికల్ పరీక్షలు కూడా దీంట్లో భాగమై ఉంటాయి. భారతదేశంలో పైలట్ శిక్షణ పూర్తికావడానికి కనీసం 15–18 నెలల సమయం పడుతుంది. – సాయి

# చందమామ లోకజ్ఞానం క్విజ్ – 33

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి `250/–*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువమంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు `50/– బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ –33 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. నవంబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. జనవరి 2012 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## మహాత్మా గాంధీ



1. మహాత్మాగాంధీ పూర్తి పేరు ఏమిటి?
2. గాంధీ ఎక్కడ పుట్టారు?
3. గాంధీ జీవితాన్ని ప్రభావితం చేసిన నాటకం ఏది?
4. గాంధీ లండన్‌లో ఏం చదివారు?
5. గాంధీ క్విట్ ఇండియా ఉద్యమాన్ని ఏ సంవత్సరం మొదలు పెట్టారు?
6. ఉప్పు సత్యాగ్రహం ఎప్పుడు ప్రారంభించబడింది?
7. గాంధీతో ముడిపడిన నినాదం ఏది?
8. గాంధీ ఎక్కడ, ఎవరిచేత చంపబడ్డారు?

**చందమామ లోకజ్ఞానం క్విజ్–30 సమాధానాలు:**

1. అబ్రహాం, 2. స్టార్ ఆఫ్ డేవిడ్, 3. 613 నిబంధనలు ఉన్నాయి, 4. హిబ్రూ, 5. బుక్ ఆఫ్ జెనెసిస్, 6. కోషెర్, 7. సబాత్, నాలుగువేల ఏళ్ల క్రితం ఇజ్రాయెల్‌లో, 9. ఇది యూదుల నూతన సంవత్సరం

*జూలై'11 నెల క్విజ్‌కు విజేతలు లేనందువల్ల బహుమతి ప్రకటించలేక పోతున్నాము.*



# నవ్వుల పువ్వులు



రమేష్ : మా పొరుగింట్లో ఉన్నతను రాత్రంతా తలను గోడకేసి బాదుకుంటూ ఉంటాడు.

రాణి : మీకు బాగా ఇబ్బంది కలిగి ఉంటుంది కదూ.

రమేష్ : లేదు లేదు. రాత్రంతా నా సంగీత సాధనకు కాస్త ఇబ్బంది కలిగింది.



నరేష్ : డాక్టర్‌గారూ, ఈ బకెట్‌కి పెద్ద రంధ్రం పడింది. దయచేసి దీనికి మరమ్మతు చేయండి.

వైద్యుడు : నేనెవరో మీకు తెలుసా?

నరేష్ : తెలీకేం. మీరు ప్లాస్టిక్ సర్జన్ కదా..!



బోనులో ఉన్న దొంగమీద ఎగిరెగిరి పడ్డాడు న్యాయమూర్తి.

పదిహేను సంవత్సరాలుగా చూస్తున్నాను. అదే బోనులోకి వచ్చి నిలబడుతున్నావు. సిగ్గులేదూ!

మీరు సిగ్గుపడాలి కాని నేనెందుకు సిగ్గుపడటం. పదిహేను సంవత్సరాలనుండీ మీరు ఆ కుర్చీ మారలేదు, అన్నాడు దొంగ.

ఏమిటీ ఈ కుక్కను పదివేల రూపాయలకు అమ్ముతావా! చాలా చాలా ఎక్కువ.

అలా అనకండి దీనికి ఉన్న విశ్వాసానికి ఆ డబ్బు చాలా తక్కువ.

ఇది అంత నమ్మకమైనదా?

తప్పకుండా. అయిదుసార్లు అమ్మాను. ప్రతిసారీ పన్నెండుగంటలలోపే తిరిగి వచ్చింది. దాన్ని విశ్వాసం అనే కదా అంటారు!



# నూడుల్ కథా కమామిషు



*నూడుల్స్ ఎక్కడ పుట్టాయి? చైనాలోనా, ఇటలీలోనా, అరేబియాలోనా?*
*దీనికి సమాధానం చెప్పడం కష్టం. కాని మీకు ఆసక్తి గొలిపే కొన్ని వాస్తవాలు ఇక్కడ చూడండి.*

ప్రపంచంలోని పలుప్రాంతాలలో పలురకాల నూడుల్స్‌ని జనం ఆరగిస్తున్నారు. చైనాలోని పసువునది సమీపంలో 4000 సంవత్సరాల క్రితం భద్రపర్చిన కుండెడు పసుపుపచ్చ నూడుల్స్‌ని పురావస్తుశాస్త్రవేత్తలు కనుగొన్నారు. నూడుల్స్ పురాతన కాలం నుండి తయారు చేయబడుతున్న వంటకం అని ఇది నిరూపిస్తోంది మరి!







మీరు జపాన్‌కి వెళ్లేటప్పుడు, అక్కడ మీ నూడుల్స్‌ని కరకర నమిలి తినండి. అది అక్కడివారి ఆచారం మరి. మీకు ఆతిథ్యమిచ్చినవారు మీ చర్యను పెద్ద గౌరవంగా లెక్కిస్తారు.



చైనీయులు పుట్టినరోజు సందర్భంగా కేక్‌లకు బదులుగా నూడుల్స్‌ని తయారు చేయడానికే ఇష్టపడతారు! ఎందుకు? నూడుల్స్ దీర్ఘాయువును సూచిస్తాయి. పుట్టినరోజు జరుపుకుంటున్న వ్యక్తి కోసం రూపొందించిన ఈ నూడుల్స్‌ని ఎన్నటికీ కోయరు. పుట్టినరోజు బహుమతులలో నూడుల్స్ చోటుచేసుకుంటాయి కూడా!



డ్రాగన్ గడ్డపు నూడుల్స్ గురించి మీరు విన్నారా? దీన్ని డ్రాగన్ పట్ల గౌరవ సూచకంగా, చాంద్రమాసమైన ఫిబ్రవరి నెలలో ప్రత్యేకించి ఆరగిస్తారు. ఈరకం నూడుల్స్‌లో పోగుల్ని డ్రాగన్ గడ్డంలోని వెంట్రుకలంత మెత్తగా చేస్తారు కాబట్టి దీనికి ఆ పేరు వచ్చింది.



రెండుచేతులతో సాగదీసే నూడుల్స్ అనేవి చైనాలో సాంప్రదాయకంగా నూడుల్స్‌ని చేసే ఒక పద్ధతి. దీంట్లో మూడు దశలుంటాయి. మెలితిప్పడం, వంచడం, లాగడం. నిపుణుడైన వంటవాడు చేతులతో నూడుల్స్‌ని సాగదీయడం చూస్తుంటే ఇంద్రజాల ప్రదర్శన చూస్తున్నంత అనుభూతి కలిగిస్తుంటుందని ప్రతీతి.



ఉడోన్ నూడుల్స్ అనేవి జపాన్‌లో వేడిగాను, చల్లటి రూపంలోనూ అందించే మందపాటి నూడుల్స్. వీటిని మొదటిసారిగా క్రీ.శ. 900లో బౌద్ధ సన్యాసులు చైనా నుంచి జపాన్‌కి తీసుకువెళ్లి పరిచయం చేశారు. వందలాది సంవత్సరాల క్రితం జపాన్‌లోని ఆసాకుసా ఆలయం బౌద్ధ యాత్రికులకు ఖరీదైన ఉడోన్ నూడుల్స్‌ని అమ్మడం ద్వారా సుప్రసిద్ధి గాంచిందిట!



జపాన్‌లో కొన్ని రెస్టారెంట్లు నగాషి సోమెన్ అనే రకం నూడుల్స్‌ని అందించేవి. పొడవాటి వెదురు దబ్బలో చల్లటినీటిని పోసి ఆ నీటిలో నూడుల్స్‌ని పోసేవారు. ఇవి పైనుంచి కిందికి కారిపోకముందే అతిథులు తమ చాప్‌స్టిక్స్‌తో వాటిని పట్టుకుని ఆరగించాలి. వేగంగా కిందికి జారిపోయే ఈ నూడుల్స్‌ని పట్టుకోవాలంటే చాలా నైపుణ్యం అవసరమవుతుంది. పైగా, వంటవాళ్లు నూడుల్స్ వచ్చేస్తున్నాయంటూ 'ఇకుయో' అని పెద్దగా అరుస్తుంటారు.



జూక్-సింగ్ నూడుల్స్‌ని సాంప్రదాయికంగా ఎలా సిద్ధం చేస్తారో మీకు తెలుసా? వంటవాడు బల్లపై పిండిని ఉంచి దానిపై లావుపాటి వెదురు కర్రను ఉంచి అటూ ఇటూ తిప్పుతూ పిండి మిశ్రమాన్ని నొక్కుతాడు. దీంతో నూడుల్స్ బాగా సాగే స్వభావంతో తయారవుతాయి.



నూడుల్స్ 2005లో మొట్టమొదటిసారిగా అంతరిక్షంలోకి కూడా వెళ్లాయి. 'రామెన్' నూడుల్స్‌కి ప్రసిద్ధిగాంచిన నిస్సిన్ ఫుడ్స్ బంతి ఆకారంలోని నూడుల్స్‌ని 'స్పేస్ రామ్' నూడుల్స్ పేరిట పరిచయం చేసింది. దీంట్లో విశేషం ఏమిటంటే, రోదసీయాత్రికులు దీన్ని గొట్టంలో ఉంచి పీల్చడానికి బదులుగా ఫోర్క్ ఉపయోగించి తినవచ్చు.





నూడుల్స్‌తో పదబంధాలు

'మీ నూడుల్ ఉపయోగించండి' అంటే 'మీ బుర్రకు కాస్త పదును పెట్టండి' అని అర్థం. 'మీ చెవుల్లో నూడుల్స్‌ని నేను వేలాడదీయలేదు' అని రష్యన్ అన్నాడంటే, 'నేను మీ కాళ్లు లాగేయలేదు అని అర్థం.



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | Where are you going? | I am going to office. |
|---|---|---|
| Telugu | మీరు ఎక్కడికి వెళుతున్నారు? | నేను ఆఫీసుకు వెళుతున్నాను. |
| Hindi | तुम कहाँ जा रहे हो?<br>తుమ్ కహాఁన్ జా రహే హో? | मैं दफ़्तर जा रहा हूँ।<br>మై దఫ్తర్ జా రహా హూన్. |
| Tamil | நீ எங்கே செல்கிறாய்?<br>నీ ఎంగే సెల్గిరాయ్? | நான் அலுவலகம் செல்கிறேன்.<br>నాన్ అలువలగమ్ సెల్గిరేన్. |
| Bengali | আপনি কোথায় যাচ্ছেন?<br>ఆపని కొథాయ్ జాచ్చెన్? | আমি অফিস যাচ্ছি।<br>ఆమి అఫీస్ జాచ్చి. |
| Marathi | तुम्ही कुठे जात आहात?<br>తుమ్హీ కుఠే జాత్ ఆహాత్? | मी ऑफीसला जात आहे.<br>మీ ఆఫీస్‌లా జాత్ ఆహె. |
| Kannada | ನೀವೆಲ್ಲಿಗೆ ಹೋಗುತ್ತಿದ್ದೀರಿ?<br>నీవెల్లిగె హోగుత్తిద్దీరి? | ನಾನು ಆಫೀಸಿಗೆ ಹೋಗುತ್ತಿದ್ದೇನೆ.<br>నాను ఆఫీసిగె హోగుత్తిద్దేనె. |
| Oriya | ତୁମେ କୁଆଡେ ଯାଉଛ?<br>తుమె కూడె జాయుచ్చా? | ମୁଁ ଅଫିସ୍‌କୁ ଯାଉଛି।<br>మున్ అఫిస్కు జాయుచ్చి. |
| Gujarati | તમે ક્યાં જઈ રહ્યા છો?<br>తమె క్యాన్ జాయ్ రహ్యా చో? | હું ઑફિસ જઈ રહ્યો છું.<br>హున్ ఆఫీస్ జాయ్ రహ్యో చున్. |
| Assamese | তুমি ক'লৈ যোৱা?<br>తుమి కొలో జొవా? | মই অফিচলৈ যাও।<br>మయి అఫీసోలో యాజావ్. |
| Malayalam | നിങ്ങൾ എവിടെ പോകുന്നു?<br>నీంగల్ అవిడె పొకున్ను. | ഞാൻ ഓഫീസിൽ പോകുന്നു.<br>న్జాన్ ఆఫీషియల్ పొకున్ను. |
| Santali | ᱚᱠᱟ ᱴᱮᱵᱤᱱ ᱥᱮᱱᱳᱜ ᱠᱟᱱᱟ?<br>ఒక టెబిన్ సెనోగ్ కనా? | ᱚᱯᱷᱤᱥ ᱤᱧ ᱥᱮᱱᱳᱜ ᱠᱟᱱᱟ।<br>ఒఫిస్ ఇంక్ సెనోగ్ కన. |
| Sanskrit | भवान् कुत्र गच्छति?<br>భవాన్ కుత్ర గచ్ఛతి? | अहं कार्यालयं गच्छामि।<br>అహం కార్యాలయం గచ్ఛామి. |

 

| English | I've heard about you. | Happy to meet you. |
|---|---|---|
| Telugu | నేను మీగురించి విన్నాను. | మిమ్మల్ని కలుసుకుంటున్నందుకు సంతోషం. |
| Hindi | मैंने तुम्हारे बारे में सुना है।<br>మైనె తుంహారే బారే మె సునా హై. | तुमसे मिलकर खुशी हुई।<br>తుమ్‌సె మిలకర్ ఖుషీ హుఈ. |
| Tamil | நான் உன்னைப்பற்றி கேள்விப்பட்டிருக்கிறேன்.<br>నాన్ ఉన్నైపట్రి కేల్విప్పట్టిరుక్కిరేన్. | உன்னை சந்திப்பதில் மகிழ்ச்சி<br>ఉన్నై సందిప్పదిల్ మగిల్చి |
| Bengali | আমি আপনার কথা শুনেছি।<br>ఆమి ఆపనార్ కథా షునెచ్చి. | আপনার সাথে সাক্ষাত করে খুশী হলাম।<br>ఆపనార్ సాథే సాక్షాత్ కరె ఖుషీ హలామ్. |
| Marathi | मी तुमच्याविषयी ऐकलंय.<br>మీ తుమ్‌చ్యావిషయీ ఏకలంయ. | तुम्हाला भेटून आनंद झाला.<br>తుమ్‌హాలా బెటూన్ ఆనంద్ జాలా. |
| Kannada | ನಾನು ನಿಮ್ಮ ಬಗ್ಗೆ ಕೇಳಿದ್ದೆ.<br>నాను నిమ్మ బగ్గె కేలిద్దె. | ನಿಮ್ಮ ಭೇಟಿಯಾಗಿದ್ದು ಸಂತೋಷ.<br>నిమ్మ భేటీయాగిద్దు సంతోష. |
| Oriya | ମୁଁ ତୁମ ବିଷୟରେ ଶୁଣିଥିଲି।<br>మున్ తుమ బిసయారె షుణిథిలి. | ତୁମକୁ ଭେଟି ଖୁସି ହେଲି।<br>తుమకు భేటీ ఖుషి హెలి. |
| Gujarati | મેં તમારા વિશે સાંભળ્યું છે.<br>మె తమారా విషె సాంభళ్యున్ చె. | તમને મળીને આનંદ થયો.<br>తమనె మళీనె ఆనంద్ థయో. |
| Assamese | মই তোমাৰ বিষয়ে শুনিছো।<br>మయి తొమార్ బిస్కయె జునిసు. | তোমাক লগ পাই সুখী।<br>తొమాక్ లగ పాయ్ జుఖీ. |
| Malayalam | ഞാൻ നിങ്ങളെക്കുറിച്ച് കേട്ടിട്ടുണ്ട്.<br>న్జాన్ నిగలెక్కురిచ్చు కెట్టిట్టుండు. | നിങ്ങളെ കണ്ടതിൽ സന്തോഷം.<br>నీంగలే కాండాథిల్ సంతోషమ్. |
| Santali | ᱟᱢ ᱤᱫᱤ ᱠᱟᱛᱤᱝ ᱟᱧᱡᱚᱢ ᱟᱠᱟᱫ-ᱟ।<br>అమ్ ఇది కటింక్ అంజోమ్ అకాడ్-అ. | ᱟᱢ ᱥᱟᱶ ᱧᱟᱯᱟᱢ ᱠᱟᱛᱮᱧ ᱠᱩᱥᱤᱜ-ᱟ।<br>అమ్ సౌన్ నాపమ్ కటెయింజ్ కుసిగ్-అ. |
| Sanskrit | मया भवद्विषये श्रुतम् अस्ति।<br>మయా భవద్విషయే శ్రుతమ్ అస్తి. | मिलित्वा सन्तोष: जात:।<br>మిలిత్వా సంతోషః జాతః. |

## దీపాల పండుగ మాత్రమే కాదు...



రావణుడిపై విజయం తర్వాత, 14 ఏళ్లు అరణ్యవాసం ముగిసి అయోధ్యాపురికి రాముడు తిరిగి వచ్చిన సందర్భాన్ని పునస్కరించుకుని ఉత్తరాదిన దీపావళిని జరుపుకుంటారు. అయితే క్రీ.శ 530లో భారతదేశంపై దండెత్తివచ్చిన హూణులపై విజయం సాధించి విక్రమాదిత్య మహారాజు రాజధాని ఉజ్జయినికి తిరిగి వచ్చిన సందర్భంగా కూడా దీపావళిని జరుపుకునేవారు. ఇక జైనమతాన్ని ఆచరించేవారు, తమ మత సంస్థాపకుడు మహావీరుడు దీపావళి నాడే నిర్వాణం పొందారని భావిస్తుంటారు. మొఘల్ చక్రవర్తి జహంగీర్ చెరనుంచి విడుదలైన తర్వాత ఆరవ సిక్కు గురువు హరగోవింద్ దీపావళి నాడే అమృత్‌సర్ వచ్చాడని సిక్కుల విశ్వాసం. దీన్ని పునస్కరించుకుని స్వర్ణ దేవాలయాన్ని దీపావళి నాడు దీపకాంతులతో అలంకరించేవారు.

## ఎద్దులూ – సంగీతమూ

గ్వాలియర్ కోటలో మన్ మందిర్ అనే రాజప్రాసాదం ఉంది. దీనిని తోమర్ పాలకుడు మన్ సింగ్ (1486–1516) నిర్మించాడు. సంగీతం అంటే అతనికి చాలా ఇష్టం. రాజప్రాసాదం మూలల్లో తాను ఉంటున్నప్పుడు కూడా సంగీతం వినేలా దీన్ని రూపొందించాడు. సంగీతంపై తనకున్న వ్యామోహమే అతడిని, గిరిజన బాలిక మృగనయనిని సన్నిహితులను చేసింది. ఒకసారి వేటకెళ్లి వస్తుండగా తను కూర్చుని ఉన్న ఏనుగు కదలక ఆగిపోయింది. ఎందుకంటే దారికడ్డంగా రెండు పోట్లగిత్తలు కుమ్ములాడుకుంటున్నాయి. ఆ దారిలో ఇద్దరు పల్లె యువతులు కనబడ్డారు. గిత్తలను చూసి భయపడినప్పటికీ, వారిలో ఒక యువతి ధైర్యంగా ముందడుగేసి ఆ గిత్తలను అదిలించి విడదీసింది. ఆమె పేరు మృగనయని. మన్ సింగ్ ఆమెను రాజప్రసాదానికి రావలసిందిగా ఆహ్వానించాడు. ఆమె సంగీతాలాపనకు ముగ్ధుడై ఆమెను పెళ్లాడాలని నిశ్చయించుకున్నాడు కాని ఆమె గుజ్జర్ తెగ యువతి కావటాన ఆమెను పెళ్ళాడలేకపోయాడు. అయితే ఆమెకోసం మన్ సింగ్ గుజారి మహల్ పేరిట వేరొక భవంతిని నిర్మించాడు. ఇదే ప్రస్తుతం పురావస్తు ప్రదర్శనశాలగా ఉంటోంది.



విదూషకుడు

బీర్బల్



# ఉదాసీన చక్రవర్తి



1. బేగం త్వరలో ప్రసవించనుంది. కాని అక్బర్ చక్రవర్తి తనపై అంతగా ఆసక్తి చూపకపోవడంతో రాణి కలవరపడింది. ఆమె బీర్బల్ కోసం కబురంపింది.



2. 'బీర్బల్, చక్రవర్తి నాపట్ల ఉదాసీనతతో ఉంటున్నారు. కారణం కనుక్కోగలవా?' అన్నది బేగం. 'ప్రయత్నిస్తాను బేగం సాహేబా' అన్నాడు బీర్బల్.



3. ఒంటరిగా ఉన్న అక్బర్‌తో బీర్బల్, 'మీరు తనను పట్టించుకోలేదని బేగం బాధపడుతోంది. ఆమెకు మీ అండదండలు అవసరం' అన్నాడు.



4. 'ఒక కొండజాతి మహిళ రహదారి పక్కనే బిడ్డకు జన్మనివ్వడం చూశాను. ఆమె తన పాపను ఒక బుట్టలో ఉంచి తర్వాత ఇంటిపనులు చూసుకోవడానికి వెళ్లింది' అన్నాడు చక్రవర్తి.



5. తర్వాత బీర్బల్ నేరుగా బేగంని కలిశాడు. 'బేగం సాహేబా! దయచేసి నేను చెప్పినట్లు చేయండి.' అంటూ బీర్బల్ తన పథకాన్ని ఆమెకు వివరించాడు.



6. బేగం రాజోద్యాన సంరక్షకుడిని పిలిపించింది. 'ఈరోజు నుంచి పూలమొక్కలకు నీళ్లు పెట్టడం ఆపివేయి. వాటిని ఎండిపోనివ్వు. ఇది నా ఆదేశమని చక్రవర్తికి తెలియజేయి.'



7. పూలమొక్కలను చూడగానే అక్బర్ కలవరపడ్డాడు. అసలు విషయం తెలియగానే హుటాహుటిన బేగం విశ్రాంతి మందిరానికి వెళ్లాడు. 'మొక్కలకు నీళ్లు పెట్టవద్దని తోటమాలికి చెప్పావా?'



8. బేగం ప్రశాంతంగా ఇలా అన్నది. 'అడవిలో మొక్కలకు ఎవరూ నీరు పోయడం లేదు. మరి పూలతోటకు మనమెందుకు నీళ్లు పోయాలి?'



9. 'ఓ.. మీరిద్దరూ ఒకే మాట మీద ఉన్నారా?' అన్నాడు చక్రవర్తి. 'ఓ కొండజాతి మహిళ బేగంతో సమానమైతే ఇది ఇలాగే ఉంటుంది మరి!'

## కనుక్కోండి చూద్దాం

రాజు పడవమనిషిని చేరుకోవడంలో సాయపడండి.



# పాకెడు తీగలు

ఈ నెల పాకెడు తీగలకు సంబంధించిన చిత్రాలతో స్క్రాప్ బుక్‌ను రూపొందిద్దాము.



ద్రాక్ష



తమలపాకు



పుచ్చకాయ



బీర



బోగన్‌విల్లా



గుమ్మడి

